# ప్రేమరాగం

రాగమణి 2

రచన
డా॥ మల్లికార్జునరావు



60 N.P

MVS
PUBLICATIONS

P.N. MENON

రాగమణి - 2



# ప్రేమరాగం

(మిస్టరీ సీరియల్)



రచన

డా॥ మల్లికార్జున రావు

ఎం.వి.యస్. పబ్లికేషన్స్,
(ఎం. వి. యస్. ప్రెస్)
66. కోడంబాకం హైరోడ్,
మద్రాసు.17.

1

మహారాజు కీర్తిసేనుని కోరిక మీద సుంకరగడం వెళ్ళిన జితేంద్రుడు రోజూ రాజ దర్బారుకు హాజరయ్యేవాడు. మంత్రి బలభద్ర దేవుని ఆసనం ప్రక్కనే అతనికి కుర్చీ వేయబడింది.

జితేంద్రునికి ప్రత్యేకించిన కుర్చీ కొన్ని రోజులనుంచి ఖాళీగా పడి ఉండటం మహారాజు గమనించాడు. 'మంత్రీ! జితేంద్రుడు దర్బారులో కనిపించడం లేదు. నిన్నైనా కలుసుకుంటున్నాడా?' అన్నాడు.

'లేదు మహారాజా! దరియాప్తు చేసి తమకు మనవి చేస్తాను,' అని దర్బారు ముగియగానే మంత్రి స్వయంగా జితేంద్రుని బసకు వెళ్ళి వాకబు చేశాడు. 'చాలా రోజులనుంచి ఆయన కనిపించడం లేదు. అన్ని చోట్లా వెదికాము. కాని, ఎక్కడా ఆయన జాడ తెలియలేదు,' అన్నారు నౌకర్లు.

బలభద్ర దేవుడు వెంటనే అన్ని వైపులకు పరిశోధకుల్ని పంపాడు. గజపతి మహారాజు మంత్రి, జితేంద్రుని తండ్రి అయిన ధీరేంద్రుని పేర నొక ఉత్తరం వ్రాసి వీరగడం పంపాడు.

# 17

ధీరేంద్రుడు బలభద్ర దేవుని ఉత్తరం చూడగానే విషయం గ్రహించాడు. తన కొడుకు జితేంద్రుడు శత్రువుల చేతికి చిక్కాడని తెలుసుకున్నాడు. అయినా తన అభిప్రాయాన్ని వెల్లడి చేయకుండా 'జితేంద్రుడు ఇక్కడ లేడు,' అని మాత్రం సమాధానం వ్రాసి వచ్చినవాని చేతికిచ్చాడు.

మరునాడు గజపతి మహారాజు దర్బారుకు రాగానే 'మహారాజా! సుందరగడాన్నుంచి నిన్నటొక మనిషి ఉత్తరం తెచ్చాడు. దాన్ని మంత్రి బలభద్ర దేవుడు వ్రాశాడు. అందులో జితేంద్రుడు కొన్ని రోజులనుంచి కనిపించడం లేదనీ, ఇక్కడ ఉంటే తెలియజేయమనీ కోరాడు. జితేంద్రుడిక్కడ లేడని నేను ముక్తసరిగా సమాధానం వ్రాసి ఇచ్చాను,' అన్నాడు ధీరేంద్రుడు.

'ధీరేంద్రా! ప్రతాపసింహుని గూఢచారుల్ని ఒంటరిగా ఎదిరించడానికి పూనుకున్నాడు జితేంద్రుడు. ఒకవేళ...'

'జితేంద్రుడు శత్రువుల మాయలో పడ్డాడని నేనూ అనుమానిస్తున్నాను. రెండు మూడు రోజుల్లో నిజం తెలియకుండా ఉండదు,' అన్నాడు ధీరేంద్రుడు.

గుణసాగర్ కూడా ఆ సమయంలో దర్బారులో ఉన్నాడు. 'నాకు అనుమతిని ఇస్తే జితేంద్రుడెక్కడ ఉన్నా వెదికి తీసుకు వస్తాను,' అన్నాడు.

'రాజకుమారా! మీ శక్తి సమర్థతలు మాకు తెలియనివి కావు. జితేంద్రుని కోసం మీరేమైనా చెయ్యగలరు. అతని యందు మీకున్న ప్రేమాభిమానాల వల్ల మీరు ఆందోళన పడుతున్నారు. జితేంద్రుని తెలివి మీకు తెలియంది కాదు. ఎంతటి తెలివైనవాడైనా ఒకొక్కప్పుడు మోసపోక

తప్పదు. అతన్ని తప్పకుండా గూఢచారులే బంధించి ఉంటారు. అయితే, ఎంత శత్రువైనా గూఢచారిని హత్య చెయ్యకూడదని ఒక నియమం ఉంది. అందుచేత మీరు అతని గురించి ఆందోళన పడవలసిన అవసరం లేదు. వారం పది రోజుల్లో అతను తప్పకుండా తిరిగి వస్తాడు,' అన్నాడు ధీరేంద్రుడు.

'కావచ్చు. కాని, మనం కూడా తగిన ప్రయత్నం చెయ్యాలి.'

'ఔను. ధీరేంద్రా! గుణసాగర్ చెప్పింది కూడా నిజమే. జితేంద్రుడ్ని వెదికించడంలో ఏమీ లోపం ఉంచవద్దు.'

'మహారాజా! ఆ ఏర్పాట్లన్నీ నిన్ననే చేశాను. మన పరిశోధక దళంతో పాటు గూఢచారుల్ని కూడా అన్ని వైపులకూ పంపాను.' ధీరేంద్రుడలా అనగానే మహారాజుతో పాటు గుణసాగర్ కూడా మౌనం వహించక తప్పింది కాదు; కాని, అతని మనస్సులోని ఆరాటం తొలగింది కాదు.

## 1౩

సుందరగడం మహారాజు మరుచటి రోజున దర్బారుకు రాగానే బలభద్ర దేవుని చూసి 'జితేంద్రుని సమాచారం ఏమైనా తెలిసిందా?' అన్నాడు.

'ఇక్కడ అతని గురించి ఏమీ తెలుసుకోలేకపోయాను. వీరగడం వెళ్ళిన మనిషి వస్తే ఏమైనా వివరాలు తెలియొచ్చు.'

మంత్రి బలభద్ర దేవుడు అలా అంటూండగానే ఒక మనిషి దర్బారులో ప్రవేశించి, మంత్రి చేతికి ఉత్తరం ఇచ్చి నిలబడ్డాడు. మంత్రి తొందరగా ఆ ఉత్తరం చదువుని 'మహారాజా! నేను పంపిన ఉత్తరానికి ధీరేంద్రుడు సమాధానంగా

ఈ ఉత్తరం వ్రాశాడు. జితేంద్రుడు వీరగడంలో కూడా లేడట,' అన్నాడు విచారంగా.

'అతనెక్కడ ఉన్నదీ తెలుసుకోడానికి చేయవలసిన ప్రయత్నాలన్నీ చెయ్యి.'

'నిన్ననే పరిశోధకులను అన్ని మూలలకూ పంపించాను,' అన్నాడు బలభద్ర దేవుడు వినయంగా.

జితేంద్రుని విషయం ఏమీ తెలియకపోవడంతో మహారాజు కీర్తిసేనుడు చాలా దిగులు పడ్డాడు. వెంటనే అతను దర్బారు చాలించి అంతఃపురానికి వెళ్ళిపోయాడు. మాటల సందర్భంలో మహారాజు జితేంద్రుడు కనిపించకపోవడం గురించి మహారాణి మణిగర్భతో చెప్పి 'రాణీ! దుర్ముఖి దుండగాలను అరికట్టడానికి జితేంద్రుడ్ని తీసుకు వచ్చాము. ఈ రోజున అతనే కనిపించకుండా పోయాడు. గజపతి మహారాజుకు ఏమని తెలియజేయాలో తెలియడం లేదు. ధీరేంద్రుడు 'నా కొడుకు నేమి చేశారు?' అని అడిగితే ఏమని చెప్పాలో తోచడం లేదు. నా దురదృష్టం అందరినీ పీడిస్తూంది,' అన్నాడు విచారంగా. మహారాణి కూడా జితేంద్రుడు కనిపించడం లేదని వినడంతోనే చాలా బాధ పడింది.

సుమతి కూడా ఆ సమయంలో మహారాణి దగ్గరే ఉంది. ఆమె మహారాజు చెప్పిన మాటలు విని వెంటనే రాగమణి భవనానికి వచ్చింది. రాగమణిని చూడగానే సుమతి దుఃఖాన్ని ఆపుకోలేకపోయింది.

రాగమణి సుమతి స్థితి చూసి కలవరపడుతూ 'ఏమి జరిగింది? ఎందుకు ఏడుస్తున్నావు?' అంది.

'రాజకుమారీ! చెప్పడానికేముంది! ఇక రాజకుమారుడు గుణసాగర్ ఇక్కడకు వచ్చే అవకాశం లేకుండా పోయింది.'

'ఆఁ!' అంది రాగమణి. ఆమె కళ్ళల్లోంచి నీరు ధారగా ప్రవహించ సాగింది.

'ఔను, రాజకుమారీ! జితేంద్రుని సహాయం లేకుండా గుణసాగర్ ఇక్కడకు రాలేరు. వచ్చినా ప్రమాదంలో చిక్కుకుంటారు. జితేంద్రుడు ఇప్పుడు సుందరగడంలో లేడు. ప్రతాపసింహుని గూఢచారులతన్ని బంధించి తీసుకుపోయారు.'

సుమతి దుఃఖానికి కారణం రాగమణి తెలుసుకుంది. సుమతి జితేంద్రుడ్ని ప్రేమిస్తుందన్న సంగతి రాగమణి దగ్గర దాగలేదు. ఆమె తన దుఃఖాన్ని దిగమ్రింగి 'సుమతీ! విచారిస్తే ప్రయోజనం లేదు. ఏదో ఒక ఉపాయం ఆలోచించాలి,' అంది.

రేవతి కూడా అక్కడే ఉంది. 'మీరు అనుమతిస్తే నేనిప్పుడే జితేంద్రుడ్ని వెదకడానికి బయలుదేరుతాను,' అంది.

'నువ్వింకా అందుకు తగవు. జితేంద్రుడ్ని సహితం బంధించగలిగిన ఆ గూఢచారులను నువ్వు ఎదిరించి సాధించలేవు. రాజకుమారి నాకు అనుమతిస్తే, నేనే స్వయంగా వెదికి తీసుకు వస్తాను,' అంది సుమతి కన్నీరు తుడుచుకుంటూ.

'నీ శ్రమ ఫలించి జితేంద్రుడు విడుదలైతే ఆజన్మాంతం అతను నీకు దాసుడై ఉంటాడు. అందులో సందేహం లేదు. ఆలస్యం చేయకుండా కార్యాన్ని సాధించుకు రా,' అంది రాజకుమారి.

'రేవతీ! నువ్వు చాలా మెలకువగా ఉండాలి. నేను లేని సమయంలో శత్రువులవల్ల రాజకుమారికి ఏ ఆపదా రాకూడదు. ఏ మాత్రం పొరపాటు జరిగినా జీవితంలో ఇక నీ ముఖం చూడను,' అంది సుమతి.

'ఆ విషయంలో నువ్వేమీ అనుమానపడ వద్దు. జితేంద్రుడ్ని విడిపించే బాధ్యత నీది; రాజకుమారిని కాపాడే భారం నాది. నువ్వు వెళ్ళిరా,' అంది రేవతి.

సుమతి రేవతికి ఇంకా చాలా విషయాలు బోధించి, హెచ్చరించింది. తర్వాత తంత్రాల సంచి భుజానికి తగిలించు కొని, కావలసిన ఇతర వస్తువులు, దుస్తులు సమకూర్చుకొని జితేంద్రుడ్ని వెదకడానికి బయలుదేరింది.

## 19

సుమతి అందమైందీ, తెలివైందే కాదు; మంచి బలమైంది కూడా. నలుగురు మనుషుల్ని నిలువరించి జయించగల శక్తి ఉంది ఆమెలో. కత్తిసాము, గుర్రపు స్వారి ఆమె చిన్న తనంలోనే నేర్చుకుంది. ఇంకా ఎన్నో వీర లక్షణాలున్నాయి సుమతిలో. అంతే కాదు, ఆమె ఆడుతుంది, పాడుతుంది; చమత్కారపూరితమైన కథలెన్నో చెబుతుంది. ఎలాంటి సమస్యలనైనా విడదీస్తుంది; చిక్కుప్రశ్నలిచ్చి ఎదుటివాళ్ళను నోరు విప్పకుండా చేస్తుంది. ఒక్క మాటలో చెప్పాలంటే ఆమెకు చేతకాని పని లేదు; తెలియని విద్య లేదు! ఎర్రని శరీరం, నిండైన దేహం, నాజూకైన చేతులు, సుకుమారమైన పాదాలు! ఆ సుందరాంగిని పూలతో కొట్టినా పాపమే అనిపిస్తుంది.

సుమతి అవసర పరిస్థితుల్లో బయటకు వెళ్ళవలసి వస్తే, తప్పనిసరిగా తన సుందరవదనాన్ని వికృతంగా తయారు చేసుకుంటుంది; లేదా వేషం మార్చుకుంటుంది.

సుమతి రాజకుమారి భవనంలోంచి బయటకు వచ్చేసరికి సాయంకాలమైంది. కను చీకటిలో ఆమె నడచిపోతూంది. కూవరగడ్డం దాటి అడవిలో ప్రవేశించింది. రాళ్ళు, గప్పలు,

చెట్లు, పుట్టలు దాటుకుంటూ మహారణ్యంలో చొరబడింది. చురుగ్గా నడవడంలో కాలికి రాయి తగిలింది. ఆమె నేల మీద బోర్లపడింది. తలకు దెబ్బ తగిలి రక్తం కారడం మొదలు పెట్టింది. తలనుంచి కారుతున్న రక్తంవల్ల బట్టలు తడిసిపోతున్నాయి. అయినా సుమతి ఆ విషయం గమనించలేదు. అలానే ఇంకా ముందుకు పోతూంది. కొంత దూరం వెళ్ళేసరికి మార్గం కనుపించ లేదు. దట్టమైన ముళ్ళ పొదలు అడ్డుగా నిలచాయి.

సుమతి సంచిలోంచి కొవ్వు వత్తి తీసి వెలిగించింది. ఆ వెలుతురులో రక్తసిక్తమైన తన బట్టలు చూసుకుంది. 'అరె!' అనుకుంటూ చుట్టూ కలయ చూసింది. దారీ తెన్నూ లేని ఆ ప్రాంతాన్ని చూడగానే సుమతి చాలా కంగారు పడింది. 'ఎక్కడిదీ ప్రాంతం? నేనిక్కడికెలా వచ్చాను? ఎందుకు వచ్చాను?' అనుకుంది. బాగా ఆలోచించి విషయం గ్రహించింది. ఆమె ఆవేశంలో ఒళ్లు మరచి తోచిన దారిని బట్టి, ఈ అడవిలో చిక్కుకుంది. జితేంద్రుని వియోగంలో తెలివి మందగించి ఇంత దూరం వచ్చింది. ఆ విషయం ఆమె గమనించడంతోనే 'జితేంద్రుడ్ని విడిపించడానికి ఇక్కడకు రానక్కర లేదు. అయోమయంగా ఇలా వచ్చాను. ప్రచండ దుర్గం గూఢచారులే అతన్ని బంధించి ఉంటారు. జితేంద్రుడ్ని విడిపించాలంటే ప్రచండ దుర్గం చేరాలి. అతనక్కడే ఉంటాడు!' అనుకుంది. వెళ్ళిన దారినే తిరిగి వచ్చి, ప్రచండ దుర్గం వైపు నడవ సాగింది. తెల్లవారుతూండగా ఆమె తన వేషం మార్చుకుని సిపాయిలా తయారైంది. సాయంకాలమౌతూండగా ప్రచండ దుర్గం చేరుకుంది. వెదక వలసిన చోట్లన్నీ వెదికింది. కాని, జితేంద్రుని జాడ తెలుసుకోలేక పోయింది. ఇక చేసేది లేక ఒక చోట కూర్చుని ఆలోచించ

సాగింది. అంతలోనే ఆమె కళ్ళు మెరిశాయి. ఉత్సాహంగా లేచి గూఢచారి శంకరదాసులా తయారైంది. తొందరగా వచ్చి పరమానందం ఇంటిలో ప్రవేశించింది.

ప్రచండదుర్గం మహారాజు ప్రతాపసింహుడు తన ఆరుగురు గూఢచారుల్లోనూ నలుగుర్ని దుర్ముఖికి సహాయంగా సుందరగడం పంపించాడు. ఇక పరమానందం, కృష్ణదాసు మాత్రం ప్రచండదుర్గంలో ఉండిపోయారు.

శంకరదాసు రూపంలో వెళ్ళిన సుమతిని చూడగానే పరమానందం ఆనందంగా ఎదురు వచ్చి 'మళ్ళీ ఎవరిని తీసుకు వచ్చారు?'

'ఎవర్నీ తీసుకు రాలేదు. రెండు రోజుల నుంచి నజీరుద్దీన్ కనిపించడం లేదు. ఇక్కడకు వచ్చాడేమో తెలుసుకుందామని వచ్చాను.'

'అతనిక్కడికి రాలేదే! ఎవరి చేతిలోనైనా పడ్డాడేమో!'

'అతన్ని బంధించడానికి ఇక అక్కడెవరున్నారు? జితేంద్రుడు మన చేతిలోనే చిక్కాడు.'

'ఆ విషయం నాకూ తెలుసు. అతనిపుడు మన కోటలోనే ఖైదీగా పడి ఉన్నాడు.'

'అతని మాటకేం లే! నజీరుద్దీన్ ఏమైందీ ముందు తెలుసుకోవాలి. నేను తొందరగా వెళ్ళి మనవాళ్ళకీ విషయం చెప్పాలి,' అని శంకరదాసు వేషంలో ఉన్న సుమతి పరమానందం ఇంటిలోంచి బయటకు వచ్చింది.

బాగా చీకటిపడింది. సుమతి ప్రచండదుర్గం బయటకువచ్చి, ఒక రాతి పలక మీద కూర్చుంది. తంత్రాల సంచిలోంచి అవసరమైన సామాన్లు తీసింది. సిపాయి వేషాన్ని తొలగించి, సహజమైన స్త్రీ రూపాన్ని ధరించింది. అయితే, ఆమె ముఖం

పోలిక తెలియకుండా అవసరమైన మార్పులు చేసుకుంది. గడ్డం ప్రక్కను చిన్న నల్ల బొట్టు కూడా పెట్టింది. నీలిరంగు చీర కట్టింది. లేత ఆకుపచ్చ పవిట వేసింది. చేతులకు నల్ల గాజులు తొడుక్కుంది. నొసటను తిలకం దిద్దింది. అందమైన ఆమె పచ్చని శరీరం ఆ అలంకరణలో ద్విగుణీకృతంగా శోభించసాగింది.

అర్ధరాత్రి గడచింది. సుందరంగా అలంకరించుకున్న సుమతి తన సున్నితమైన వ్రేళ్ళ మధ్య మురళిని ఇముడ్చుకుని, కోట గోడను సమీపించింది. రాజమహలుకు సమీపంగా ఎత్తైన నేల మీద కూర్చుని, తీయని కంఠాన్ని విప్పి ఒకపాట పాడింది. పాట పూర్తి అవడంతోనే ఆ పాటనే తిరిగి మురళి మీద వాయించింది. అలా రెండు పాటలు పాడి మురళి మీద వాయించింది.

ఆ సమయంలో మహారాజా ప్రతాపసింహుడు మహారాణితో కలిసి, కబుర్లు చెబుతూ మధ్యలోనే ఆగిపోయాడు. మహారాణి భర్త ముఖంలోకి చూస్తూ ఉండిపోయింది.

'మహారాణీ! ఆ తీయని కోయిల కంఠం నన్ను తన్మయత్వంలో ముంచేస్తూంది!'

'మహారాజా! భ్రమపడుతున్నారు. అది మానవ కంఠం కాదు; మురళీ ధ్వని.'

మహారాజు, మహారాణి-ఇద్దరూ మళ్ళీ విన్నారు. మురళే వినబడుతూంది.

'మహారాణీ! ఆమె పాట పాడ్డంలోనే కాకుండా మురళి ఊదడంలో కూడా చాలా ప్రజ్ఞను చూపిస్తూంది.'

'కాదు మహారాజా! ఆమె మురళినే వాయిస్తూంది!'

'నీ సంశయాన్ని ఇప్పుడే తీరుస్తాను,' అని మహారాజా దాసీ

లను పిలచి 'ఆ పాట పాడే ఆమెను ఇక్కడకు తీసుకు రండి,' అని ఆజ్ఞాపించాడు.

దాసీలు కోట బయటకు వచ్చి సుమతిని సమీపించారు. సుమతి రూపు రేఖలు, హావ భావాలు చూసి దాసీల నోట మాట రాకుండా పోయింది. ఆమెను 'నువ్వు' అని సంబోధించాలో 'మీరు' అని సంబోధించాలో తెలియక చాలా సేపు తికమకలు పడ్డారు. చివరకు 'అమ్మా! మహారాజు మిమ్మల్ని చూడాలంటున్నారు. దయ ఉంచి మాతో రండి,' అన్నారు.

సుమతి ఉద్దేశమే అది! అందుకే ఆమె అంత రాత్రిలో ఒంటరిగా కూర్చుని పాడసాగింది. తన గానము మహారాజుని ఆకర్షించినందుకు చాలా సంతోషించింది. ఉత్సాహంగా లేచి దాసీలతో కలిసి రాజభవనంలో ప్రవేశించింది. ప్రతాప సింహ మహారాజుకు, మహారాణికి వినయంగా నమస్కరించి నిలబడింది.

మహారాజు ప్రతాపసింహుడు సుమతి సుందర వదనాన్ని చూడగానే ఆశ్చర్యపడకుండా ఉండలేకపోయాడు. తీర్చి దిద్దిన ఆమె అలంకరణ మహారాజును ఇట్టే ఆకర్షించింది. అంతటి సౌందర్యరాశి అర్ధరాత్రి సమయంలో ఒంటరిగా కూర్చుని పాటలు పాడుతూండడానికి గల కారణం తెలుసు కోవాలని కుతూహలపడ్డాడు.

అంతలో సుమతి కనురెప్పలు తాటిస్తూ పాడటానికి అను మతి కోసం మహారాజు ముఖంలోకి చూసింది.

సుమతి చురుకైన చూపు మహారాజుకు మైకం కమ్మిం చింది. అతను బరువెక్కిన కళ్ళతో సుమతి శరీరంలోని ప్రతి అవయవాన్నీ పరికించి చూస్తూ ఉండిపోయాడు.

సుమతి ఉత్సాహంతో ఉప్పొంగిపోయింది. నెమ్మదిగా

రెండడుగులు ముందుకు వేసింది. చిలతనంగా ముఖం పెట్టి 'మహారాజా! తమ ఆజ్ఞకోసం చూస్తున్నాను,' అంది మృదుగా.

ప్రతాపసింహుడు పైకంలోంచి తేరుకున్నాడు. 'చూడు, నీ పేరేమిటి? ఎక్కడ ఉంటున్నావు? ఏమి చేస్తున్నావు?' అన్నాడు కుతూహలంగా.

'మహారాజా! నన్ను మోహిని అంటారు. మాతృదేశానికి దూరమై, ప్రస్తుతం ఇక్కడే ఉంటున్నాను. నేను చేసిన చిన్న పొరపాటు వల్ల ప్రేమించిన ప్రియుడు కంటికి దూరమయ్యాడు. అతన్ని వెదుక్కుంటూ దేశదేశాలూ తిరుగుతున్నాను; అన్ని రాజ దర్బారులూ వెదుకుతున్నాను. కాలం గడిచేకొద్దీ వియోగ బాధను సహించలేక అతను పాడే పాటలనే పాడుకుంటూ కాలం గడుపుతున్నాను.'

'అతను కూడా గాయకుడేనా?'

'ఔను మహారాజా! అతనే నాకీ పాటలు నేర్పాడు. అతను రాజాధిరాజుల సమక్షంలోనే గానం చేస్తాడు.'

'అలాగా! అతను చాలా అదృష్టవంతుడు—'

'మహారాజా!' మహారాణి గొంతుకలో చాలా బాధ కనిపించింది.

ప్రతాపసింహుడు మహారాణి ముఖంలోకి చూశాడు. 'ఔను మహారాణీ! గాయకీ గాయకులైన ప్రేయసీ ప్రియులకు కలిగే ఆనందం మరొకరికెలా కలుగుతుంది? మోహినీ! నీ గాన మాధుర్యం చెప్పడానికలవి కాదు. అందుకే ఇక్కడకు రప్పించాను. నీ కోయిల కంఠం విప్పి మమ్మల్ని ఆనందపరచు,' అన్నాడు.

మహారాజు మనసులోని మనుకారాన్ని మహారాణితో

పాటు సుమతి కూడా గ్రహించింది. రూప సౌందర్యాలతో మహారాజు మనసును కలవరపరచి, తన గానంతో అతన్ని ముగ్ధుడ్ని చేసి, తన కోసం తపించే పరిస్థితిని కలిగించి, అతని వివేకం మీద ముసుగు కప్పాలని సుమతి ఉద్దేశం. ఆమె ప్రయత్నం ఫలించింది. ఆ విషయం ఆమె గమనించి అమితానందం చెందింది. ఇక జితేంద్రుడ్ని విడిపించడం క్షణంలో పననుకుంది. మరొకసారి మహారాజు కళ్ళల్లోకి చూసింది. తన కంటిపాపల కదలిక ననుసరించి మహారాజు హృదయం నాట్యం చేస్తుందని పూర్తిగా నమ్మిక కలిగింది.

మహారాజు ప్రతాపసింహుని ఆజ్ఞ వినగానే సుమతి పాట మొదలుపెట్టింది. మొదటి పాట ముగిసింది; రెండవ పాట ప్రారంభించింది; మూడవ పాట పూర్తయింది. ఆమె అలా పాడుతూనే ఉంది. సుమతి గానమాధుర్యం మహారాణి పద్మముఖిని లాలించి, నిద్ర పుచ్చింది. కాని, మహారాజు మాత్రం ఒళ్లు తెలియని మోహాంధకారంలో మునిగిపోయాడు. కామంతో మత్తెక్కిన కళ్ళతో సుమతి సౌందర్యాన్ని జుర్రేస్తున్నాడు. ఎక్కువ తక్కువలను మరచిపోయి, మంచి చెడ్డలను విడిచిపెట్టి, రాజగౌరవాన్నే విస్మరించి, వశం తప్పిన మమకారంతో ఆసనంమీంచి లేచిన మహారాజు నెమ్మదిగా వచ్చి సుమతి ముందు నిలబడ్డాడు.

సుమతి తన పాటను మానకుండా చూపులతోనే అతన్ని హెచ్చరించింది. 'మహారాజా! మీ అభిమానానికి పాత్రురాలనయ్యాను. ఈ దాసి మీద మీకు కలిగిన దయకు కృతజ్ఞతాపూర్వక వందనాలు. మీ ఆదరాన్ని మించి నాకింకేమి కావాలి? కాని, మహారాజా! అలా చూడండి! మహారాణి! ఆమె హృదయాన్ని బాధ పెట్టకూడదు. ఆమె ఆగ్రహానికి గురి కావడానికి నేనంగీకరించను. ఆమె సమక్షంలో పొర

పాటుగా ప్రవర్తించ వద్దని మనవి చేస్తున్నాను. మీరు వెళ్ళి ఆసనం మీద కూర్చోండి. మిమ్మల్ని ఆనందింపజేయడమే నా ఆశయం. నా అందం చూశారు; నా గానం విన్నారు. ఈ దాసి మిమ్మల్ని ఆనందపరచడానికి అన్ని విధాల సిద్ధంగా ఉంది. ఆతృత పడకండి,' అంటున్నాయి ఆమె కళ్ళు.

ఆజ్ఞాపించే మహారాజు ఆమె ఆజ్ఞలకు లోబడ్డాడు. వికల మైన మనసుతో తిరిగి వెళ్ళి ఆసనాన్నధిష్ఠించాడు.

సూర్యోదయమౌతూంది. సుమతి పాట పూర్తి చేసి మౌనంగా మహారాజు ముఖంలోకి చూసింది. ఆ చూపు మహా రాజు శరీరాన్ని పులకరింప చేసింది. కామోద్రేకంతో అతని శరీరం వేడెక్కింది. సుమతి చూపులు అతన్ని అదలించి ఆపు చేయకపోతే ఏమి చేసేవాడోగాని, ఆమె అతన్ని అన్ని విధాల అదుపులో ఉంచింది.

మహారాజు ఆసనంమీంచి లేవబోయి మళ్ళీ కూర్చుండి పోయాడు. సుమతి చూపిన చూపే అందుకు కారణం! అతనిక ఓపికగా కూర్చుండలేకపోయాడు. అయినా సుమతిని సమీపించడానికి సాహసం చాలక 'మోహినీ! నిజంగా నువ్వు జగన్మోహినిలా ఉన్నావు. నీ రూప సౌందర్యాలు నన్ను ముగ్ధుణ్ణి చేశాయి. నీ గాన మాధుర్యంతో నన్ను ...రపింప చేశావు. నీ చూపులతో నన్ను బంధించావు. ... సంగీతంలో ప్రవేశముంది. కాని, నువ్వు ఆఖరున ... రాగ మేమిటో తెలుసుకోలేకపోయాను,' అన్నాడు.

...హారాజా! ఏమని చెప్పమంటారు! నా ప్రియుడు నాకు ...రాగాలు చెప్పాడు, పాటలు నేర్పాడు. కాని ఈ ... ఏమంటారో మాత్రం చెప్పలేదు. నేనెన్నోసార్లు ... అయినా చెప్పడానికి ఇష్టపడలేదు. నేనడిగినప్పు ...్యతో నా కళ్ళల్లో కళ్ళు పెట్టి చూస్తూ చాలా

సేపు మౌనంగా ఉండిపోయేవాడు. అతన్ని అడిగి అడిగి విసుగెత్తి ఊరుకున్నాను. అయితే, పేరులేని రాగం ఉండదు కనుక నేనే దానికొక పేరు పెట్టుకున్నాను.'

'ఏమి పేరు పెట్టావు?'

'ప్రేమరాగం.'

'ప్రేమరాగమా!'

'ఔను మహారాజా! ప్రేమరాగమే! ఈ రాగం నేనాలాపించినపుడల్లా నా ప్రియుడు నా కళ్ళ ముందు నిలచి నవ్వుతూ నా వంక చూస్తూన్నట్టనిపిస్తూంది. అతనెక్కడికి పోయాడో, ఎలా ఉన్నాడో?'

'మోహినీ! నీ సుందర వదనంమీద విచార రేఖలు చూడలేక పోతున్నాను. ఆ విషయం మరచిపో—'

మహారాజు మాట పూర్తి చేయక ముందే మహారాణికి మెలకువ వచ్చింది. ఆమె మోహినిని చూసి 'మోహినీ! నీ పాట నన్ను సుఖంగా నిద్రపుచ్చింది. ఎంతోకాలంనుంచి నిద్రకు ముఖం వాచాను. ఈ రోజు నువ్వు నా బాధను తొలగించావు,' అంది.

'మోహినీ! మహారాణి సుఖంకోసం నువ్వు కొన్నాళ్ళిక్కడే ఉండు. నీకు కావలసిన సౌకర్యాలన్నీ చేయ[illegible] తాయి. సాయంకాలం దర్బారులో గానం చేసి అ[illegible] ఆనందపరచు,' అన్నాడు మహారాజు.

'మహాప్రసాదం!' అంటూ లేచి నిలబడింది సుమతి.

సాయంకాలమైంది. అపురూపంగా అలంకరిం[illegible] సుమతి దర్బారులో మధ్యగా కూర్చుంచె. ఆమె రూపం సభికుల కళ్ళను మిరుమిట్లు గొలిపింది. ద[illegible] ఉన్న వాళ్ళందరూ సుమతి పొంకమైన శరీర[illegible]

ముగ్ధులైపోయారు. రెప్ప వేయకుండా అందరూ ఆమెనే చూస్తూ ఉండిపోయారు. అంతలో మహారాజు దర్బారులో ప్రవేశించి సింహాసనాన్నధిష్ఠించాడు.

సుమతి పాట మొదలుపెట్టింది. రాజ దర్బారులోని వాద్య బృందం ఆమె పాట ననుసరించి తన పని ప్రారంభించింది. ఘనతకెక్కిన గాయకులంతా ఆమె పాట విని మెచ్చుకున్నారు. సభలో వాళ్ళంతా 'ఓహో!' 'శహబాష్!' అనకుండా ఉండలేకపోయారు. మొదటి పాట ముగిసింది. సుమతి 'తోడి' వర్ణం ప్రారంభించింది. సమర్థనీయమైన సాధికతో ఆమె పాడుతూంటే వాయిద్యాలు ఆమె పాటను అనుసరించలేక పోయాయి. వాయిద్యాలు నిలచిపోయినా, సుమతి తన పాటను మానకుండా వీణను చేతబట్టి స్వయంగా తానే వీణను వాయిస్తూ వర్ణం ముగించింది.

సభకు వచ్చిన పండిత పామరుల నందరనూ రంజింప జేసిన సుమతిని ప్రతి ఒక్కరూ పొగిడారు. మహారాజు తన మెడలోని ముత్యాలహారం బహుమతిగా ఇచ్చాడు.

సుమతి హారం తీసుకుని మహారాజుకు నమస్కరించి 'మహా ప్రభూ! నేనొకసారి వీరగడంలో గజపతి మహారాజు దర్బారులో గానం చేశాను. నా అదృష్టంకొద్దీ ఆ రోజున మంత్రి కొడుకు జితేంద్రుడు నా ప్రక్కన కూర్చుని వీణ వాయించాడు. ఆహా! ఆ సుదినం మళ్ళీ రాదు. ఆ నాటి ఆనందాన్ని ఈనాటి వరకూ పొందలేకపోయాను. తమవంటి మహారాజులను మెప్పించ గలిగిన నేనే ఆ వీణానాదానికి లోబడిపోయాను. జితేంద్రుని చేతి వ్రేళ్ళు వీణను మీటుతూంటే మహదానందంగా నేను పాడిన పాట ఏనాటికీ మరపు రాదు. మహారాజా! జితేంద్రుని వీణానాదంతో నా కంఠాన్ని మేళ

వించి పాడాలనే అభిలాషతో కొద్ది రోజుల క్రితం పీరగడం వెళ్ళాను. కాని, జితేంద్రుడు అక్కడ కనిపించలేదు. ఇక పీరగడంలో ఉండడం ఇష్టంలేక వెంటనే తిరిగి వచ్చాను. మహారాజా! ఎప్పటికైనా అతను వీణ వాయిస్తూండగా తమకు నా గానాన్ని వినిపించి, శాశ్వతంగా తమ హృదయఫలకంలో నా రూపం నిలచి ఉండేలా చేసుకుంటాను,' అంది.

'మోహినీ, ప్రస్తుతం జితేంద్రుడు మా కోటలోనే ఖైదీ ఉన్నాడు. కాని, ఖైదీగా ఉండి అతను వీణ వాయించ అంగీకరిస్తాడనుకోను.'

'మహారాజా! చాలా సంతోషకరమైన మాట చెప్పారు నా పేరు వింటే చాలు - అతను వీణను చేత పట్టడానికి సిద్ధపడతాడు. కాని, మహారాజా! చిన్న మనవి: అతన్ని ఇష్టపరచడానికి చిన్న ఉపాయం ఉంది.'

'ఏమిటది?...'

'పద్దెనిమిదేళ్ళ వయస్సులో ఉన్న బ్రాహ్మణ బ్రహ్మచారి ఆహ్వానించాలి. ఆ సమయంలో సైనికులెవ్వరూ అక్కడ ఉండకూడదు. అతను పారిపోతాడనే అనుమానం ఉంటే, కాళ్ళకు సంకెళ్ళు వేయండి. మరొక మాట: వీణ చాలా విలువైంది ఉండాలి. నేను చెప్పిన పద్ధతి ననుసరిస్తే అతను తప్పక వస్తాడు.'

మహారాజు దర్బారంతా కలయజూశాడు. అతని చూపు పేరిశాస్త్రి మీద పడింది. సర్వ లక్షణ సమన్వితుడైన పేరి శాస్త్రి పద్దెనిమిదేళ్ళ వయస్సులో ఉండి మహారాజు దృష్టి నాకర్షించాడు. మహారాజు సంతోషంగా అతన్ని దగ్గరకు పిలిచాడు. 'పేరిశాస్త్రీ! నువ్వు వెళ్ళి జితేంద్రుడ్ని తీసుకుని రా!' అని సైన్యాధిపతిని చూసి 'నువ్వు ముందు వెళ్ళి సైనికులతో చెప్పు. పేరిశాస్త్రి జితేంద్రుడ్ని సమీపించగానే,

సైనికులు దూరంగా తొలగిపోవాలి. ఆఁ! జితేంద్రుని కాళ్ళకు మాత్రం సంకెళ్ళు వేయాలి. అది మాత్రం మరచి పోకు,' అన్నాడు.

పేరిశాస్త్రి ఖైదులో ఉన్న జితేంద్రుడ్ని సమీపించాడు. 'జితేంద్రా! దర్బారులోకి ఎవరో గాయకురాలు వచ్చింది. ఆమె కోరిక మీద మహారాజు నిన్ను ఆహ్వానించి తీసుకు రమ్మన్నారు,' అన్నాడు.

జితేంద్రుడు వెంటనే గ్రహించాడు. తన విడుదలకోసం ఎవరో ప్రయత్నిస్తున్నారని తెలుసుకున్నాడు. సంతోషంగా పేరిశాస్త్రితో బయలుదేరాడు. దర్బారులోకి వస్తూనే విష యాన్ని అర్థం చేసుకున్నాడు. దర్బారుకు మధ్యగా కూర్చున్న మహారూపవతి తన వైపే చూస్తూంది. దర్బారులో ఉన్న వాళ్ళంతా తమ చూపులను ఆమె మీదే కేంద్రీకరించి చూస్తు న్నారు. జితేంద్రుడు దర్బారులో ప్రవేశించగానే సుమతి లేచి నిలబడింది. 'మంత్రి కుమారా! మీ కోసమే చూస్తు న్నాను. ఈ మోహిని మిమ్మల్ని మరచిపోగలదా! ఆ నాడు వీరగడంలో నా పాటకు ప్రాణం పోసిన మీ వీణానాదం నా చెవుల్లో ప్రతిధ్వనిస్తూంది!' అంది నవ్వుతూ.

ఆమె నవ్వులో ఉన్న ప్రత్యేకత జితేంద్రుడ్ని ముగ్ధుడ్ని చేసింది. ఆమె కంఠ ధ్వని అతన్నెంతో ఆనందపరచింది. అతనామెను తేలికగా గుర్తించాడు. ఆమె అన్న మాటల్లోని భావాన్ని గ్రహించాడు. 'మోహినీ! నువ్వా! ఇక్కడికెలా వచ్చావు! ఖైదులో పడి కుమిలిపోతున్నాను. కాని, నిన్ను చూడగానే నా విచారం తొలగిపోయింది. నువ్వు పాడు తూండగా ఒక్కసారి వీణ వాయించి మరీ చనిపోవాలను కున్నాను. నా అదృష్టం కొద్దీ కనిపించావు,' అని ప్రతాప సింహుని వైపు తిరిగాడు. 'మహారాజా! మోహిని పాటను

వినిపించి సంతోషపరచడానికి నన్ను ఇక్కడకు రప్పించారనుకుంటాను. మీ ఉదార హృదయానికి నా కృతజ్ఞతాపూర్వక నమస్కారాలర్పిస్తున్నాను. కాని మహారాజా! ఆమె పాట విని నేను సంతోషించలేను. ఆమె పాడుతూండగ వీణ వాయించాలని చాలా కుతూహలంగా ఉంది. మీరు అనుమతిస్తే—' అని ఊరుకున్నాడు.

తనే స్వయంగా అడగాలనుకున్న మహారాజు జితేంద్రుని మాట వినగానే అంగీకారాన్ని తెలియపరచాడు.

సుమతి తన స్థానంలో కూర్చుంది. జితేంద్రుడు ఆమెకు దగ్గరగా కూర్చున్నాడు. అతని ముందు వీణ ఉంచబడింది. ఆమె అతని ముఖంలోకి చూసింది. ఆ చూపులోని భావాన్ని అర్థం చేసుకున్నాడు జితేంద్రుడు. 'నేను చేయగలిగినంత చేశాను. ఇక నీ తెలివి, బలము ఉపయోగించి బయటపడే మార్గం చూడు!' అంటున్నాయి ఆమె కళ్ళు. అంతే కాదు, ఆమె కళ్ళల్లో ఆందోళన, ఆత్రుత గోచరిస్తున్నాయి. అందుకు కారణం-జితేంద్రునికి సంగీతంలో ప్రవేశం ఉన్న విషయం ఆమెకు తెలియకపోవడమే!

జితేంద్రుడు చిరునవ్వుతో ఆమెను సముదాయించాడు. అతని ప్రశాంతమైన నవ్వును చూసి సుమతి మనసు కొంచెం కుదుట పడింది. కాని, అతని సంకల్పమేమిటో తెలుసుకోలేక ఆమె మరొకసారి అతని వైపు చూసింది. జితేంద్రుడు వీణ తీగలను సవరిస్తున్నాడు. అతను చేస్తున్న పని చూసి ఆమె ఆశ్చర్యపడకుండా ఉండలేకపోయింది. అయినా తన సంశయం తీరక 'మీకా వీణ సరిపడలేదా?' అంది.

'ఆ విషయం నువ్వే తెలుసుకోవాలి!' అని జితేంద్రుడు శృతి చేసిన వీణను చేతపట్టి, కల్యాణి రాగ వర్ణాన్ని ఒకసారి క్రిందినుంచి పైకి, పైనుంచి క్రిందకు పలికించి విడచి

పెట్టాడు. ఆ వీణానాదం దర్బారులో ఉన్న వాళ్ళందరినీ సమ్మోహితుల్ని చేసింది. సుమతి సంభ్రమాశ్చర్యాలతో జితేంద్రుని ముఖంలోకి చూస్తూ ఉండిపోయింది. మహారాజుతో సహా దర్బారులో ఉన్న వాళ్ళంతా అదే స్థితిలో ఉండడంవల్ల సుమతి కళ్ళల్లోని ఉత్సాహ పూరితమైన ఆనందాన్ని గమనించలేకపోయారు.

జితేంద్రుడు మహారాజుకు నమస్కరించాడు. 'మహారాజా! ఏమిటి సెలవు?' అన్నాడు.

మహారాజు ప్రతాపసింహుడు సుమతి వైపు చూశాడు.

'మహారాజా! భైరవి రాగం నాకు అభిమానమైంది. మంత్రి కుమారులు వీణ వాయిస్తూండగా ఆ రాగంలో పాట పాడాలని నాకు చాలా కుతూహలంగా ఉంది. తమ సెలవైతే పాడి వినిపిస్తాను,' అంది సుమతి.

ప్రతాపసింహుని అనుజ్ఞ అవడంతోనే సుమతి పాడటం మొదలుపెట్టింది. ఆమె ఒక చరణం పాడేవరకూ జితేంద్రుడు వీణ మీటకుండా ఊరుకున్నాడు. అందరూ జితేంద్రుని వైపు చూశారు. మహారాజు కూడా ప్రశ్నార్థకంగా అతన్ని చూశాడు. సుమతి కూడా పాడుతూనే ప్రక్కకు చూసింది. జితేంద్రుడు ఆమె కళ్ళల్లోకి నవ్వుతూ చూసి, వేళ్ళను వీణ తీగల మీద పోనిచ్చాడు. ఆశ్చర్యం!...సుమతి పాడుతూనే ఉంది. పాటకు తగిన భావాలు ఆమె ముఖంలో కనబడుతూనే ఉన్నాయి; కాని, ఆమె పలికే ప్రతి అక్షరం వీణలోంచే వినబడుతూంది గాని, ఆమె నోటినుండి వినపడ్డంలేదు. వీణ తీగల్లోంచి వస్తున్న ప్రతి అక్షరం ప్రస్ఫుటంగా వినబడుతూంది. భావాన్ని వ్యక్తపరుస్తూన్న సుమతి నోటిలోంచి ధ్వని వస్తూందో, లేదో తెలియడం లేదు!...

దర్బారులో ఉన్నవాళ్ళందరూ అనుమానాశ్చర్యాలతో

సుమతి నోటివంకే చూస్తూ ఉండిపోయారు. మహారాజు కూడా అదే సందేహంలో పడ్డాడు. అతను చేయి పైకెత్తి ఏదో అనబోతూండగా జితేంద్రుడు వీణమీటించి చేతులు తీ వేశాడు.

సుమతి పాడుతూనే ఉంది! ఆమె గొంతుక మామూ వినపడుతూనే ఉంది. దర్బారులో వాళ్ళంతా చ పోయారు. మహారాజు కూడా విభ్రాంతి చెందాడు. ఆ నందాలతో అతను అటు సుమతినీ, ఇటు జితేంద్రుడ్నీ సాగాడు.

అంతలోనే జితేంద్రుడు వీణ మీటాడు. సుమతి పాటను అనుసరించి వాయించసాగాడు. సుమతి కంఠం వీణానాదంలో లీనమైంది.

ఈమారు దర్బారులో ఉన్నవాళ్ళు సుమతి పాటను గాని, జితేంద్రుని వాయిద్యాన్ని గాని నిర్మలంగా వినలేకపోయారు. అందరి హృదయాల్లోనూ ఒకే ప్రశ్న అలుముకుంది. 'ఇద్దరిలో ఎవరు సమర్థులు? మోహినా? జితేంద్రుడా? మోహిని గాత్రం గొప్పదా? జితేంద్రుని వాయిద్యం గొప్పదా?' వాళ్ళ ప్రశ్నకు సమాధానం రాక ముందే పాట పూర్తయింది. జితేంద్రుడు వీణను క్రింద పెట్టి, మహారాజుకు నమస్కరించాడు.

'జితేంద్రా! చాలా సంతోషపరచావు. నీ గురించి మోహిని చెప్పిన మాటల్లో ఏమీ అతిశయోక్తి లేదు. మరి కొంతసేపు కాలక్షేపం చేసి మాకు తృప్తి కలిగించండి,' అన్నాడు మహారాజు.

'మహారాజా! క్షమించండి. నేను రోజుకు ఒక్క రాగమే వాయిస్తాను. అది నా నియమం.'

'ఔను మహారాజా! ఆ రోజున గజపతి మహారాజు కూడా

వీరి మనస్సు మార్చలేకపోయారు. కావాలంటే మరుచటి రోజున వాయిస్తానన్నారు కాని, ఆనాడు వాయించడానికి ఇష్టపడలేదు.'

'మహారాజా! మన్నించండి. నా నియమాన్ని భంగపరచకండి. రేపు తప్పక తమను సంతోషపరుస్తాను.'

మహారాజు జితేంద్రుని మాటను కాదనలేకపోయాడు. అందులో సుమతి జితేంద్రుడ్ని సమర్థిస్తూ చెప్పిన మాటలు మహారాజు మనస్సులో వేదవాక్కుల్లా నాటాయి. 'సరే. మళ్ళీ రేపు ఈ సమయంలోనే సభ ఏర్పాటవుతుంది,' అన్నాడు మహారాజు.

పేరిశాస్త్రి దగ్గరుండి జితేంద్రుడ్ని తిరిగి ఖైదులోకి తీసుకు వెళ్ళాడు. సుమతి తనకు ప్రత్యేకించిన ఇంటిలో ప్రవేశించింది.

జితేంద్రుడు వీణ వాయిస్తూండగా సుమతి పాడిన పాటను మహారాజు మరచిపోలేకపోయాడు. మరుచటి రోజున కూడా పేరిశాస్త్రిని పంపి జితేంద్రుడ్ని రప్పించాడు. జితేంద్రుడు ఆ రోజున కూడా ఒకే పాటకు వీణ వాయించి ఊరుకున్నాడు. తర్వాత ఇతర వాయిద్యాలతో కలిసి సుమతి రెండు పాటలు పాడింది. కాని, మహారాజును ఆ పాటలు ఆనందపరచలేకపోయాయి. జితేంద్రుని వీణానాదంతో మిళితమైన సుమతి పాటను ఇంకా వినాలనే కోరికతో మహారాజు మూడవ రోజున కూడా జితేంద్రుడ్ని రమ్మని కోరాడు.

ఆ నాడు దర్బారు ప్రత్యేకాలంకరణతో కళకళలాడుతూంది. అధికారులు, కోటీశ్వరులు, పండితులు ముందే వచ్చి, తమ తమ ఆసనాలను అధిష్ఠించారు. మహారాజు దర్బారులో ప్రవేశించగానే పేరిశాస్త్రిని జితేంద్రుని కోసం పంపిం

చారు. అప్పటికి ఇంకా మోహిని కూడా రాకపోవడం వల్ల ఇద్దరు సైనికులు ఆమె ఇంటికి పంపించబడ్డారు.

జితేంద్రుడ్ని తీసుకు రావడానికి వెళ్ళిన పేరిశాస్త్రి అంతలోనే తొందరగా దర్బారులో ప్రవేశించి 'మహారాజా, మన్నించండి. అనవసరంగా సైనికులు నా మీద అపవాదు వేస్తున్నారు. నేనే జితేంద్రుడ్ని తీసుకు వచ్చాననంటున్నారు,' అన్నాడు.

అంతలోనే పహారా సైనికులు కూడా దర్బారులోకి వచ్చి మహారాజుకు నమస్కరించి 'మహారాజా! అతని మాటలు నమ్మకండి. అర ఘడియ ముందు వచ్చి ఇతనే జితేంద్రుడ్ని తీసుకు వెళ్ళాడు,' అన్నారు వినయంగా.

అదే సమయంలో మోహిని ఇంటికి వెళ్ళిన సైనికులు కూడా కంగారుగా వచ్చి మహారాజు ఎదుట చిన్న చీటీ (ఉత్తరం) ఉంచారు. మహారాజు ఆతృతగా ఆ చీటీ విప్పి చూశాడు. అందులో ఇలా ఉంది:

"మహారాజా: కోరిన ప్రియుడు కనికరించాడు. అంతు లేని ఆనందంతో అతనితో కలిసి వెళ్ళిపోతున్నాను. అవకాశం ఉంటే మరొకప్పుడు తమ దర్శనం చేసుకుంటాను."

ఆ ఉత్తరం చదవగానే మహారాజు మనసు వికలమై పోయింది. సుమతి రూప సౌందర్యాలకు దాసుడైన మహారాజు జితేంద్రుడు తప్పించుకు పోయినందుకు ఏమీ బాధ పడలేదు. కాని, 'జితేంద్రుడ్నే మోహిని ప్రేమిస్తోందా?' అనే సందేహం అతన్ని ఆరాటపరచింది. ఆరాటం ఆగ్రహంగా మారింది. అతను దర్బారులో ఉన్న గూఢచారులు-పరమానందం, కృష్ణదాసుల వైపు చూశాడు. 'జితేంద్రుడు తప్పించుకు పోయాడు. అతన్ని పేరిశాస్త్రి తీసుకు వెళ్ళాడంటు

న్నారు సైనికులు. జితేంద్రునితో పాటు మోహిని కూడా ఇప్పుడే మాయమైంది. ఏమిటీ చిత్రం?...' అన్నాడు.

ఇద్దరు గూఢచారులూ లేచి నిలబడ్డారు. 'మహారాజా! పేరి శాస్త్రి మాతోనే కలిసి వచ్చాడు. వచ్చినప్పటినుంచి ఇక్కడే ఉన్నాడు. ఇక సైనికుల మాట కూడా తోసివేయకూడదు. జితేంద్రుడ్ని పేరిశాస్త్రి తీసుకు రాలేదు; కాని, అతని రూపం లోనే శత్రు గూఢచారులెవరో అతన్ని విడిపించారనడంలో సందేహం లేదు. ఇంతకూ ఈ మోహిని ఎవరో వివరాలు తెలియ లేదు,' అన్నారు.

మహారా— వాళ్ళ మాటలు విని మండిపడ్డాడు. 'ఇప్పటి వరకూ మీ·ఏమి చేస్తున్నారు? జితేంద్రుడు చేతిలోంచి జారి పోయాడు. మోహిని పరారయ్యింది. ఇక మీరుండి లాభ మేమిటి?' అన్నాడు. వెంటనే అతను సైనికులను పిలచి 'మీరు తొందరగా అన్ని వైపులకూ వెళ్ళండి. జితేంద్రుడ్ని, మోహినిని వెదకి బంధించి తీసుకు రండి,' అని ఆజ్ఞాపించి దర్బారులోంచి వెళ్ళిపోయాడు.

## 20

మ్మరుచటి రోజున మహారాజు ప్రతాపసింహుడు దర్బారుకు రాగానే చోబ్‌దారు వినయంగా ఇలా అన్నాడు: 'మహా రాజా! మనల్ని మోసం చేసిన మోహిని జితేంద్రునితో కలిసి ఉండగా అడవిలో చూశాను. రహస్యంగా వాళ్ళను సమీ పించి ఆ ఇద్దరి సంభాషణా విన్నాను. జితేంద్రుడు ఆమెను సుమతీ అని పిలుస్తున్నాడు. ఆమే పేరిశాస్త్రి రూపంలో వెళ్ళి, అతన్ని విడిపించుకు పోయింది. ఆమె భుజానికి ఒక సంచి తగిలించుకుని ఉంది. చేతిలో ఏవో కొన్ని ఉండలు ఉన్నాయి. ఆమె ఒక ఉండ తీసి నేలమీద కొట్టింది. పెద్ద చప్పుడుతో అది ప్రేలింది. ఆ ప్రాంతమంతా తెల్లని పొగతో

నిండిపోయింది. పొగ పోయే వరకూ అక్కడే ఉన్నాను. ప్రతాపసింహుడు తప్పకుండా మనకోసం సైనికులను పంపు తాడు. ఆ సైనికుల ప్రాణాలు తీయడానికి ఈ ఉండలు చాలు,' అంది ఆమె. ఆ మాటలు వినగానే నేను తొందరగా ఇక్కడకు వచ్చాను. మహారాజా! మన గూఢచారులను పంపిస్తే వాళ్ళు పట్టుపడతారు. సైనికులు వాళ్ళను బంధించడం చాలా కష్టం. చమత్కారంగా మన గూఢచారులే వాళ్ళను పట్టుకోవాలి.'

ఆ మాటలు వినగానే గూఢచారి పరమానందం లేచి నిల బడ్డాడు. 'మహారాజా! ఇతని మాటలవల్ల సుమతే మోహినిలా వచ్చి జితేంద్రుడ్ని విడిపించుకు పోయిందని తెలుస్తుంది. వాళ్ళను సైనికులు బంధించడం కష్టమే! ఆ ఇద్దరినీ బంధించ డానికి మాకు అనుమతి ఇవ్వండి. ఇప్పుడే వెళ్ళి కార్యాన్ని సాధించుకు వస్తాము,' అన్నాడు.

'ఔను, మహారాజా! అదే మంచిది. మన పరమానందం, కృష్ణదాసులు నాతో వస్తే సుమతీ జితేంద్రులున్న చోటు చూపిస్తాను,' అన్నాడు చోబ్‌దారు.

మహారాజు ఆజ్ఞాపించగానే పరమానందం, కృష్ణదాసులు చోబ్‌దారుతో కలిసి బయలుదేరారు.

ముగ్గురూ పట్టణం విడిచిపెట్టి అడవిలో ప్రవేశించారు. కొంత దూరం వెళ్ళాక చోబ్‌దారు గూఢచారులిద్దరికీ ఒక చెట్టును చూపించి 'నేను చూసేటప్పటికి ఈ చెట్టు క్రిందే కూర్చున్నారు,' అన్నాడు.

'ఏరీ, కనిపించరేం?' కృష్ణదాసు అనుమానిస్తూ అడిగాడు.

'బాగుంది! నాలుగు వైపులా వెతుకుదాం రండి. ఇక్కడే ఎక్కడో ఉంటారు.'

ముగ్గురూ ఆ అడవిలో వెదకడం మొదలు పెట్టారు. అంతలో ఒక ముసలామె నెత్తిమీద పాల గంప ఎత్తుకుని వాళ్ళకు ఎదురైంది.

'అవ్వా! ఇలా ఎవరైనా వెళ్ళారా?' అన్నాడు కృష్ణదాసు.

ఆ ముసలిది కృష్ణదాసు అడిగిన మాట విని కూడా సమాధానం చెప్పకుండా తొందరగా ప్రచండ దుర్గం వైపు వెళ్ళిపోతూంది.

'ఏయ్, ముసలీ! వయసు మళ్ళినా పొగరు తగ్గలేదేం! మాటకు జవాబు చెప్పి వెళ్ళు,' అన్నాడు చోబ్‌దారు ఆమెకు ఎదురుగా నిలబడి.

'చూడు బాబూ, ఎంత పొద్దెక్కిందో! పొద్దు నెత్తి మీద కొచ్చాక పాలెవరు కొంటారు? మీకు సమాధానం చెపుతూ కూర్చుంటే, ఇంటి దగ్గర పిల్లలకు తిండి లేకుండా పోతుంది.'

'ఒక్క మాట చెప్పి పో అవ్వా! నీకు దారిలో ఎవరైనా ఎదురయ్యారా?' పరమానందం బుజ్జగించి అడిగినట్టు అడిగాడు.

'అయ్యో రాత! చెప్పకపోతే పోనివ్వరా ఏం? పోతున్నారు; ఈ దారినే ఇద్దరు పోతున్నారు. ఒక ఆడదీ, దాని మగడూ పోతున్నారు. ముంతెడు పాలు తాగి పావలా ఇచ్చారు.

'ఆడదీ, దాని మగడూనా! వాళ్ళెలా ఉన్నారో చెప్పు?'

'ఎలా ఉన్నారని చెప్పేది. మనుషుల్లాగే ఉన్నారు. మీతో కబుర్లు పెట్టుకు కూచుంటే నా పాలు అమ్ముడుపోవు. దారివ్వండి-పోతాను.'

'నీ గంపలో ఉన్న పాలన్నీ మేమే కొంటాము. గంప దించుకో,' అన్నాడు చోబ్‌దారు.

ముసలిది సంతోషంగా గంప క్రిందపెట్టి, నేల మీద చతికిలబడింది. ముగ్గురూ గంపలోని పాలన్నీ పూర్తిగా త్రాగారు. తరువాత చోబ్‌దారు ముసలిదాని చేతిలో ఒకరూపాయి పెట్టి 'అవ్వా! ఆ ఇద్దరూ ఎలా ఉన్నారో చెప్పు? వినాలని కుతూహలంగా ఉంది,' అన్నాడు.

ముసలిది రూపాయిని త్రిప్పి త్రిప్పి చూసుకుంటూ చెప్పడం మొదలుపెట్టింది: 'అదిగో చూడండి - ఆ మలుపుందా? దానికి కొంచెం అవతల మగడూ, పెళ్ళాం కూర్చున్నారు. నన్ను చూసి దగ్గరకు పిలిచారు. కడుపునిండా పాలు తాగి పావలా ఇచ్చారు. 'అవ్వా! బ్రతికించావు. సుందరగడం వెళ్ళేవరకూ ఇక ఫరవాలేదు,' అన్నాడతను.'

'ఆఁ!' పరమానందం అన్నాడు.

'అవును బాబూ! అతను సుందరగడం మహారాజు కొలువులో నౌకరీ చేస్తున్నాడు. ఆ పిల్ల - అచ్చంగా నా మనుమరాల్లా ఉంది - రాజకుమారి దగ్గర చెలికత్తెగా ఉంటుంది.'

'ఆ సంగతి నీకెలా తెలిసింది?'

'ఆళ్ళే చెప్పారు బాబూ!' అని ముసలిది గంప నెత్తి మీద పెట్టుకొని 'ఇకెళ్ళొస్తాను బాబూ!' అంటూ ప్రచండ దుర్గం వైపు నడవసాగింది.

ముగ్గురూ ముసలామె చెప్పిన దిక్కుగా పరుగెత్తసాగారు. కొంత దూరం వెళ్ళేసరికి చోబ్‌దారు తల రెండు చేతులతోనూ పట్టుకొని కూర్చుండిపోయాడు. పరమానందం, కృష్ణదాసు అతన్ని సమీపించి 'అదేం, కూర్చున్నావేం?' అన్నారు.

'ఒళ్లు జోగుతూంది; కళ్లు తిరుగుతూన్నాయి.'

'అలాగా! అరె! నాకూ అలాగే ఉందే!' అంటూ పరమానందం కూడా తల పట్టుకున్నాడు. కృష్ణదాసు ఏమీ మాట్లాడ

లేదు. కాని, అతను కళ్లు నలుపుకుంటూనే తెలివి తప్పి నేల మీద పడిపోయాడు. ఒక నిమిషం హెచ్చు తగ్గులో చోబ్‌దారు, పరమానందం కూడా నేల మీదకు ఒరిగిపోయారు.

పాల ముసలిది కొంత దూరం వెళ్ళి, ఒక చెట్టు ప్రక్కను నిలబడి అదంతా చూస్తూనే ఉంది. ముగ్గురూ నేల మీద పడిపోగానే ఆమె పరుగెత్తుకుంటూ అక్కడకు వచ్చి, చోబ్‌దారు ముక్కు దగ్గర విరుగుడు తైలం ఉంచింది. అతను రెండు తుమ్ములు తుమ్మి, లేచి కూర్చున్నాడు. నవ్వుతూ ముసలిదాని చెయ్యి పట్టుకొని 'సుమతీ! నాకు తగినదానవు దొరికావు!' అంటూ మృదువుగా ఆమె బుగ్గ మీద చిన్న చిటిక వేశాడు.

'జితేంద్రా! మనం ఇక్కడ ఆలస్యం చేయకూడదు. మహారాజు నీ కోసం చాలా కలవరపడుతున్నారు. అంతే కాకుండా రాజకుమారిని కాపాడే బాధ్యతను రేవతికి అప్పగించి వచ్చాను. మనం తొందరగా సుందరగడం చేరడం మంచిది,' అంది సుమతి ముసలి వేషం తొలగించుకుంటూ.

జితేంద్రుడు ఇద్దరు గూఢచారులనూ గుడ్డలో వేసి మూట కట్టి భుజం మీద పెట్టుకున్నాడు.

## 21

సుమతి జితేంద్రుడిన్ని విడిపించడం కోసం రాజకుమారి భవనంలోంచి బయటకు వెళ్ళగానే రేవతి ఆలోచనలో పడింది. 'శత్రు గూఢచారులు చాలామంది ఇక్కడ ఉన్నారు. శక్తియుక్తులు కలిగిన జితేంద్రుడే వాళ్ళ మాయకు లోబడ్డాడు. రాజకుమారిని బంధించి తీసుకుపోడానికి కూడా వాళ్లు వెనుదీయకపోవచ్చు. ముందే తగిన జాగ్రత్త తీసుకోవడం మంచిది!' అనుకుంది. వెంటనే ఆమె కొన్ని వస్తువుల మిశ్రమంతో ఒక

మెత్తని పదార్థాన్ని తయారు చేసింది. అందరూ నిద్రపోయాక ఆమె ఆ మిశ్రమ పదార్థాన్ని రాజకుమారి గది గుమ్మానికి బయటా, లోపలా రెండు గజాల వరకూ నేల మీద పూసింది. నీళ్ళలో కలిపి రాసిన ఆ వస్తువు పది నిమిషాల్లో ఆరిపోయి నేల మామూలుగా కనబడసాగింది. ఆ నేల మీద ఒక ద్రవ పదార్థం పూసిన జాడ కూడా కనబడకుండా పోయింది. అలా చేసిన తర్వాత రేవతి రాకుమారి మంచం ప్రక్కనే నిద్ర పోయింది.

తెల్లవారుతూండగా లేచిన రేవతి రాజకుమారి మంచం వైపు చూసింది. రాజకుమారి రాగమణి ఇంకా నిద్రపోతూనే ఉంది. ఏ ఒడుదుడుకులు లేకుండా ఆ రాత్రి గడిచిపోయి నందుకు రేవతి చాలా సంతోషించింది. రాత్రి పూత పూసిన స్థల మంతా తొందరగా నీటితో కడిగి శుభ్రపరిచింది. అదే సమ యంలో రాజకుమారికి మెలకువ వచ్చింది. నేలను కడిగి శుభ్రపరుస్తున్న రేవతిని చూసి ఆశ్చర్యపోయింది. 'రేవతీ! దాసీలు చేయవలసిన పని నువ్వు చేస్తున్నావేం?' అంది.

'ఇది దాసీలు చేయవలసిన పని కాదు; రేవతి చేయవలసిన పనే! నీకు అనుమానంగా ఉంటే ఇంకా లోపలి గుమ్మం కడుగలేదు. వచ్చి అక్కడ కాలు వెయ్యి, తెలుస్తుంది,' అంది రేవతి గుమ్మం బయట నీరు పోస్తూ.

రాగమణి ఆశ్చర్యంగా మంచంమీంచి దిగి మామూలుగా గుమ్మం దగ్గరకు వస్తోంది. ఆమె కాలు మిశ్రమద్రవాన్ని పూసిన ప్రదేశంలో పడగానే పెద్ద చప్పుడై భవనమంతా ప్రతిధ్వనించింది. ఆ శబ్దానికి రాజకుమారి కంగారుపడి గది లోంచి బయటకు పరుగెత్తుకు వచ్చింది. అయితే, ఆమె బయ టకు వచ్చేసరికి మూడుసార్లు ఆమె కాళ్ళు పసరు పూసిన నేల మీద పడ్డాయి. మూడుసార్లూ పెద్ద చప్పుడై రాజ

కుమారిని పొడలగొట్టింది. రాగమణి ఆందోళనతో వచ్చి రేవతిని పట్టుకుంది. అప్పటికి రేవతి కూడా లేచి నిలబడి పక పక నవ్వుతూ 'రాజకుమారీ! ఈ పని దాసీలు చేయగలరా?' అంటూ రాగమణికి తను రాత్రి చేసిన పని చెప్పి 'రాజ కుమారీ! ఇదొక మిశ్రమ ద్రవాలతో తయారు చేసిన పసరు. సుమతే దీన్ని కనిపెట్టింది. దీనికి 'ఆత్మ రక్షణి' అని పేరు కూడా పెట్టింది. ఏమరుపాటుగా ఉన్నప్పుడు శత్రువులు వస్తే తెలుసుకోవడానికి ఇదొక సాధనం. అంతే కాదు; ఆ శబ్దం వినగానే వాళ్ళు పారిపోతారు కూడా. ప్రస్తుతం శత్రువులు మీ కే ఆపదా కలిగించకుండా ఉండడానికే దీన్ని ఉపయో గించాను,' అంది రేవతి.

రెండవ రోజు రాత్రి రాజకుమారి రక్షణ బాధ్యత వహిం చిన రేవతి మరొక పద్ధతి అవలంబించింది. ఆమె ప్రొద్దుట నుంచి సాయంకాలం వరకూ కష్టపడి మూడు మూర్తులా రాజకుమారిలానే మట్టితో బొమ్మను తయారు చేసి రంగులు వేసి మెరుగులు దిద్దింది. తర్వాత దానికి రాజకుమారి ధరించే వస్త్రాలు కట్టబెట్టింది. చీకటి పడ్డ తరువాత దాన్ని రాగమణి సహాయంతో మోసుకొని వచ్చి, రాగమణి పరుండే మంచం మీద ఆ బొమ్మను పరుండబెట్టింది. రాజకుమారి అడుగుతున్న మాటలకు సమాధానం చెప్పకుండా రేవతి తన మొలలో దోపిన డబ్బా పైకి తీసింది. దానిలో మెత్తని సుగంధ ద్రవ్యం ఉంది. రేవతి ఆ ద్రవ్యాన్ని బొమ్మ శరీరానికంతకూ పూసింది. రేవతి చేస్తున్న పని చూసి రాజకుమారి తెల్లబోయింది. 'రేవతీ! బొమ్మకు కూడా సువాసన ద్రవ్యం పూయాలా!' అంది. 'రాజకుమారీ! ఇది సువాసన ద్రవ్యం కాదు; సమ్మో హన పదార్థం. బొమ్మ మీద మాత్రం చెయ్యి వెయ్యకు. నా

ఎత్తు ఫలిస్తే దీని తమాషా రేపు తెలుస్తుంది. నువ్వు ఈ రాత్రి మరొక గదిలో పరుండాలి,' అంది రేవతి.

రేవతి రాగమణికి మరొక గదిలో పడక అమర్చి, ఆ గది గుమ్మానికి లోపలా బయటా 'ఆత్మరక్షణి'ని పూసింది. తర్వాత రేవతి బొమ్మను పరుండబెట్టిన గదిలో ప్రవేశించింది. నిద్రపోతూన్నట్టున్న ఆ బొమ్మకు గుండెల వరకూ శాలువ కప్పింది. వెలుతురు బాగా తగ్గించింది. తలుపులు దగ్గరకు చేరవేసి, ఆమె ప్రక్క గదిలోకి వెళ్ళి తలుపులు గడియ పెట్టుకుంది.

అర్ధరాత్రి గడిచింది. భవనంలో ఎక్కడా అలికిడి లేదు. దాసీలందరూ మత్తుగా నిద్రపోతున్నారు. రేవతి మాత్రం గదిలో కూర్చుని ఘడియలు లెక్క పెడుతూంది. ఆమె నిద్ర మత్తును ఒదుల్చుకోడానికి లేచి నిలబడి ఒళ్ళు విరుచుకుంటోంది. అంతలోనే బొమ్మ ఉన్న గదిలోంచి 'బజ్' మనే శబ్దం రావడం మొదలుపెట్టింది. ఆ ధ్వని వినగానే రేవతి ఉత్సాహంగా గదిలోంచి బయటకు వచ్చి 'దొంగలు!దొంగలు! రాజకుమారి గదిలో దొంగలు పడ్డారు!' అని అరవడం ప్రారంభించింది. మరు నిముషంలో దాసీలందరూ ఆమె దగ్గరకు వచ్చి భయాందోళనలతో రాజకుమారి పరుండే గదిలోకి చూశారు. రేవతి అప్పటికే కాంతివంతమైన లాంతరు తెచ్చి రాజకుమారి గది ముందు ఉంచింది. వచ్చిన దాసీలు గదిలోకి చూడగానే కంపించిపోయారు. ఒక దాసీ వేగంగా వెళ్ళి మహారాజుతో ఆ విషయం చెప్పింది.

మహారాజు, మహారాణి ఆత్రుతగా రాకుమారి భవనంలో ప్రవేశించారు. మహారాజు రాగమణి గదిలోకి చూశాడు. రాగమణి మంచం మీద నిద్రపోతూంది. ఇద్దరు మనుషులు ఆమె తల దగ్గర ఒకరు, కాళ్ళ దగ్గర ఒకరు నిలబడి ఉన్నారు.

మహారాజు కీర్తిసేనుడు ఆగ్రహంతో చుట్టూ చూశాడు. అప్పటికే పహారా సిపాయిలు కొందరు లోపలకు వచ్చి మహారాజు ఆజ్ఞకోసం చూస్తున్నారు. కీర్తిసేనుడు సిపాయిలను చూసి 'వాళ్ళను బంధించండి,' అన్నాడు. సిపాయిలు చురుగ్గా గదిలో చొరబడబోతున్నారు. అంతలో రేవతి గుమ్మానికి అడ్డంగా నిలబడి 'ఆగండి, తొందరపడకండి. వాళ్ళెంతలో ఎక్కడికీ పారిపోరు. మహారాజా! తలుపులు తెరచి ఉండగా కూడా వాళ్ళు పారిపోడానికి ప్రయత్నించక పోవడానికి కారణం చెపుతాను వినండి,' అని ప్రక్కకు చూసింది. అదే సమయంలో భవనంలో మరొక గదిలో తుపాకీలు ప్రేలిన శబ్దం వినబడింది. అందరూ ఆందోళనతో అటు చూశారు. రాజకుమారి నవ్వుతూ వచ్చి తల్లిదండ్రులకు నమస్కరించింది. ఇద్దరు రాగమణులు ఒక్కసారి కనిపించడంతో మహారాజుతో పాటు అక్కడ ఉన్న వాళ్ళందరూ సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయారు.

అప్పుడు రేవతి రాత్రి తను చేసిన పనంతా చెప్పి ఇలా అంది: 'మహారాజా! ఆ ఆత్మ రక్షిణి పూసిన చోట రాజకుమారి కాళ్ళు వేసి నడచి రావడంవల్లే ఆమె ఇక్కడకు వచ్చే ముందు ప్రేలుళ్ళు వినబడ్డాయి. ఇక గదిలో ఉన్న బొమ్మ సంగతి చెపుతాను వినండి: బొమ్మకు పూసిన సుగంధ ద్రవ్యంలో మానవుని జ్ఞానాన్ని మందగింప చేసే ప్రబలమైన శక్తి ఉంది. అంతే కాదు; ఆ సుగంధ లేపనాన్ని తాకిన మనిషి తాకుతూండగా ఏ స్థితిలో ఉన్నాడో అదే స్థితిలో ఒక గంట వరకూ ఉండిపోతాడు. అతనిలో కొంచెం కూడా చైతన్యం ఉండదు. అదిగో - ఆ గదిలో ఉన్న ఇద్దరూ రాజకుమారిని ఎత్తుకు పోవాలని వచ్చి, ఆమె రూపంలో ఉన్న ఆ

బొమ్మను తాకారు. బొమ్మకు పూసిన లేపనం వారి శరీరాలకు తగలగానే ఆ ఇద్దరూ చైతన్యహీనులైపోయారు. వాళ్ళకు మనం ఇక్కడ ఉన్నామని తెలుసుకునే శక్తి కూడా లేదు. అందుకే మనం ఇంత గట్టిగా మాట్లాడుకుంటున్నా, వాళ్ళల్లో ఏవిధమైన తొట్రుపాటూ కలగలేదు. తొందరపడి మనలో ఎవరైనా వాళ్ళ దగ్గరకు వెళ్ళి వాళ్ళ శరీరాలను తాకితే, ఆ తాకిన వాళ్ళకు కూడా ముందు వాళ్ళ గతే పడుతుంది. అందుకే మన సిపాయిలను లోపలకు వెళ్ళకుండా ఆపు చేశాను. మహారాజా! ఇంతకూ వీళ్ళు దొంగలు మాత్రం కారు. వీళ్ళు తప్పకుండా దుర్ముఖికి సహాయం చెయ్యడానికి వచ్చిన ప్రచండ దుర్గం గూఢచారులే. అందులో మాత్రం సందేహం లేదు. వీళ్ళకు తగిన ప్రాయశ్చిత్తం చెయ్యాలి.'

రేవతి చెప్పిన మాటలు విని మహారాజు, మహారాణి చాలా ఆనందించారు. రాగమణిని కాపాడ్డానికి రేవతి పన్నిన యుక్తికి బహుమతిగా మహారాజు నూరు వరహాలు మంజూరు చేస్తే, మహారాణి మణిగర్భ మెడలోని హారాన్ని కానుకగా ఇచ్చింది.

రేవతి బహుమానాన్నందుకొని మహారాజుకు, మహారాణికి నమస్కరించింది.

మహారాజు అక్కడున్న వాళ్ళనందరినీ పరిశీలించి చూసి 'రేవతీ! సుమతి కనుపించదేం?' అన్నాడు.

ఆ మాట వినగానే రేవతి, రాజకుమారి ఒకరి నొకరు చూసుకున్నారు. తర్వాత రేవతి మహారాజు వైపు తిరిగి 'మహారాజా! సుమతికి రెండు రోజులనుంచి ఆరోగ్యం బాగు లేదు,' అని చెప్పి, ఆ సంభాషణ మార్చాలనే తలంపుతో ఆమె ఏవేవో కబుర్లు చెప్పడం మొదలు పెట్టింది. ఆమె మహా

రాజుతో మాట్లాడుతున్నా,మాటి మాటికీ గదిలోకి చూస్తూనే ఉంది.

కొంతసేపైంది. గదిలో ఉన్న వాళ్ళలో కలిగిన కదలికను రేవతి గుర్తించగానే సైనికులను హెచ్చరించింది.

అప్పుడే తెలివిలోకి వచ్చిన గూఢచారులిద్దరూ రేవతి హెచ్చరికను విని గుమ్మం వైపు తిరిగారు. అక్కడ దృశ్యం చూసి ఇద్దరూ ఆశ్చర్యపోయారు.

'దేవానందం, మహారాజు వచ్చి మన ఎదుట నిలచినా తెలియకుండాపోయింది. ఏమిటీ చిత్రం?' అన్నాడు శంకరదాసు.

'ఏమి చెప్పమంటావు? జితేంద్రుడు బందీ అయ్యాడు' సుమతి అతన్ని విడిపించడానికి బయలుదేరింది. ఇక ఇక్కడ చెప్పుకోతగ్గ గూఢచారులెవరున్నారని నిర్లక్ష్యంగా వచ్చాం. జిత్తులమారి రేవతి చేతిలో పడ్డాం. ఈమెకింత తెలివి ఉందని తెలిస్తే, ముందే జాగ్రత్త పడేవాళ్ళం!'అన్నాడు దేవానందం.

సైనికులు మీదకు రావడం చూసి ఇద్దరూ కత్తులు దూశారు. ప్రాణాలకు తెగించి పోరాడి తప్పించుకు పోవడానికి ప్రయత్నించారు. శంకరదాసు ఇద్దరు సైనికులను నేలకూలేలా నరికితే, దేవానందం చేతిలో ముగ్గురు సిపాయిలు ప్రాణాలు కోల్పోయారు. అయినా ఆ గూఢచారులిద్దరకూ తప్పించుకు పోవడానికి తగిన సావకాశం చిక్కలేదు. సైనికుల కరకు కత్తుల మధ్య ఇద్దరూ కదలకుండా నిలచిపోవలసి వచ్చింది.

మహారాజు ఆ ఇద్దరు గూఢచారులను ఖైదు చేసి కట్టుదిట్టమైన కాపలా పెట్టమని ఆజ్ఞాపించి, మహారాణి రత్నగర్భతో కలిసి తన భవనానికి వెళ్ళిపోయాడు.

సూర్యోదయం కాగానే మహారాజు మంత్రి బలభద్ర దేవుణ్ణి పిలిపించాడు. అతనితో గూఢచారులను

బంధించిన విషయం చెప్పి 'జితేంద్రుని జాడ ఏమైనా తెలిసిందా?' అన్నాడు మహారాజు.

'ఇంత వరకూ అతని సమాచారమేమీ తెలియలేదు. కాని మహారాజా! మనకు చిక్కిన గూఢచారుల్ని బాధిస్తే, జితేంద్రుడు ఎక్కడ బంధించబడిందీ తెలుస్తుందనుకుంటున్నాను.'

'నిజమే! కాని, గూఢచారుల్ని పీడించడం ధర్మ విరుద్ధం. జితేంద్రుడికి ఆ విషయం తెలిస్తే చాలా బాధపడతాడు సరికదా; మనకిక సహాయం చెయ్యడానికి కూడా అంగీకరించడు. ఇంకా కొన్ని రోజులు చూసి తర్వాత ఆ విషయం ఆలోచిద్దాం. ముందు మీరు మాత్రం ఒక పని చెయ్యాలి. సైన్యాల్ని వెంటనే యుద్ధానికి తయారు చేయండి. ప్రతాప సింహుడు తప్పకుండా మన దేశం మీద దాడి చేస్తాడు. అతన్నెదిరించడానికి మనం కూడా సిద్ధంగా ఉండాలి.'

మహారాజా! ఆ ఏర్పాట్లన్నీ నేను ముందే చేశాను. అయితే మహారాజా! నాదొక చిన్న మనవి ఉంది—'

'సందేహిస్తారేం? చెప్పండి.'

'ఇక్కడున్న ముసల్మానులందరూ దుర్ముఖి పక్షం వహించారని, సాధ్యమైనంత త్వరలో వాళ్ళనందరినీ నౌకరీల్లోంచి తొలగించమని గుణసాగరే కాకుండా గజపతి మహారాజు కూడా నేను వీరగడం వెళ్ళినప్పుడల్లా చెపుతున్నారు. స్వయంగా నేను కూడా ఆ విషయం గుర్తించాను. ఈ సందర్భంలో మీ ఆజ్ఞకోసం ఎదురు చూస్తున్నాను.'

'మీరు చెప్పినదానిలో పొరపాటేమీ లేదు. నేనే స్వయంగా ఈ సంగతి మీకు చెప్పాలనుకున్నాను. క్రమంగా మీ అభిప్రాయాన్ని అమలులో పెట్టండి,' అని మహారాజు అంతటితో సంభాషణ ముగించాడు.

## 22

మహారాజు ప్రతాపసింహుడు జితేంద్రుడ్ని, సుమతిని బంధించడానికి పరమానందాన్ని, కృష్ణదాసుని పంపించగానే దర్బారు చాలించి మహారాణి భవనానికి వెళ్ళాడు. సుమతి సౌందర్యానికి దాసుడైన ప్రతాపసింహుని మనస్సు పద్మముఖి సుందరవదనాన్ని చూసినా కుదుట పడలేదు. అతను విచారంగా ఉండడం చూసి మహారాణి పద్మముఖి చాలా దిగులు పడింది. ఎన్నో విధాల భర్త విచారాన్ని దూరం చేయడానికి ప్రయత్నించింది. కాని, మహారాణి ప్రయత్నాలన్నీ వృధా అయ్యాయి. ఇక గత్యంతరం లేక ఆమె మహారాజు ప్రక్కను కూర్చుని, విచారానికి కారణమడిగింది. ప్రతాపసింహుడు మహారాణికేమీ సమాధానం చెప్పలేదు. మౌనం వహించి శూన్యంలోకి చూస్తూ కూర్చున్నాడు.

'మహారాజా! ఏమిటీ మౌనం? నేను చేసిన అపరాధమేమిటి? నా వల్ల ఏదైనా పొరపాటు జరిగితే క్షమించండి. నాలో ఏమైనా లోపం ఉంటే చెప్పండి; సవరించుకుంటాను,' అంటూ పద్మముఖి కంట తడి పెట్టింది.

వివాహానంతరం మహారాణి కన్నీరు కార్చిన మొదటి రోజు అదే!

ప్రతాపసింహుడు ఆమె దుఃఖాన్ని చూసి సహించలేకపోయాడు. 'మహారాణీ! నా మౌనానికి ఇతర కారణాలేమీ లేవు. రాజ్యాంగ విషయాలను పరిష్కరించడంలో కొంచెం ఎక్కువ సమయాన్ని వినియోగించాలి. ఆలోచనల ఒత్తిడి వల్ల కాస్త అలసట కలిగింది. అందువల్లే నీకు వెంటనే సమాధానం చెప్పలేకపోయాను. అంతే!' అన్నాడు పద్మముఖిని సముదాయిస్తూ.

'అయితే, నిన్నటి గాయకిని పిలిపించేదా - రెండు పాటలు పాడి మనస్సుకు ఉల్లాసాన్ని కలిగిస్తుంది.'

'ఆమె మనల్ని అందరినీ మోసం చేసి మాయమైపోయింది. ఇంకెవరి పాట అంత సంతోషాన్ని కలిగిస్తుంది?'

ఆ మాట విని మహారాణి ఎంతో ఆశ్చర్యపోయింది. 'మోహిని చెప్పకుండా వెళ్ళిపోయిందా? ఆమె ఎవరిని మోసం చేసింది? ఎలా మోసగించింది? కొంచెం వివరంగా చెప్పండి,' అంది.

'మహారాణీ! ఇది సమయం కాదు. మరొకప్పుడు చెపుతాను,' అని మహారాజు అక్కడనుండి బయటకు వచ్చి తన మందిరానికి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి అంతా మహారాజు కంటి మీద కునుకు పట్టలేదు. కన్ను మూసినా, తెరిచినా సుమతి రూపం అతని కళ్ళ ముందు నాట్యం చేయసాగింది. సుమతి సుందర వదనం, ఆమె శరీర సౌష్ఠవం, అవయవాల బింకం, కళ్ళల్లోని చురుకు, కంఠంలోని తీపి, నడక వయ్యారం, భావ గాంభీర్యం ఒకటేమిటి-ఆమెలోని ప్రతీ లక్షణం కూడా ప్రతాపసింహుడ్ని మోహాంధకారంలో ముంచి విడిచిపెట్టింది. కామాగ్ని అతని మనసును దహిస్తూండగా శరీరం వేడెక్కి, కళ్ళు ఎఱ్ఱబారి, ముఖం వాడిపోయి, అవయవాలు పట్టు తప్పి, వివేకం అంతరించిన ప్రతాపసింహుని హృదయారాటం తొలగకుండానే తెల్లవారింది.

ప్రతాపసింహుడు దర్బారుకు రావడంతోనే 'జితేంద్రుడు, సుమతి పట్టుబడ్డారా?' అన్నాడు.

'లేదు మహారాజా! ఇంతవరకూ మన గూఢచారులు కూడా తిరిగి రాలేదు.'

ఆ మాట వినడంతోనే మహారాజు దిగులు మరీ ఎక్కువైంది. అతను మౌనంగా దర్బారంతా కలయ చూడసాగాడు.

అంతలో సద్గుణ తంత్రవేత్త, దుర్ముఖి, నజీరుద్దీన్ లు దర్బారులో ప్రవేశించి, మహారాజుకు నమస్కరించి కూర్చున్నారు. మహారాజు వాళ్ళను ఒకసారి పరికించి చూశాడు. ముగ్గురూ దీనంగా తలలు వంచుకు కూర్చున్నారు. వాళ్ళ స్థితిని చూడగానే మహారాజు విషయమేమిటో తెలుసుకోడానికి ఆతృత పడ్డాడు. వెంటనే దర్బారు ముగించి, ఆ ముగ్గురినీ వెంటబెట్టుకొని ఆలోచనా మందిరంలో ప్రవేశించాడు. అందరూ కూర్చున్న తర్వాత 'మీరు సుందరగడం వెళ్ళి ఏమి సాధించుకు వచ్చారో చెప్పండి?' అన్నాడు మహారాజు.

'మహారాజా! ఏమి చెప్పమంటారు? సత్యానందాన్ని జితేంద్రుడు బంధించాడు; శంకరదాసునీ, దేవానందాన్నీ రేవతి అనే ఆమె తన ప్రజ్ఞా విశేషం వల్ల ఖైదు చేసింది. ఇక నేను ఒక్కడినీ మిగిలిపోయాను. మనవాళ్లు ముగ్గురు బంధింపబడితే, జితేంద్రుడొక్కడు మాత్రం మన చేతికి చిక్కాడు. అతన్ని ఆ రోజునే మన కోటకు పంపించాము. ఇంతకంటే మరేమీ జరగలేదు,' అన్నాడు సద్గుణ తంత్రవేత్త వినయంగా.

'జితేంద్రుడు కూడా ఇప్పుడు మన చేతిలోంచి జారిపోయాడు. ఒక స్త్రీ వచ్చి అతన్ని విడిపించుకు పోయింది. ఆమె అందరి కళ్ళూ కప్పి, పట్టపగలే అతన్ని తీసుకు పోయింది. మరుచటి రోజున చోబ్‌దారు వల్ల ఆమె పేరు సుహాసిని తెలిసింది. కృష్ణదాసు, పరమానందం కలసి వాళ్ళను వెదకి పట్టుకోడానికి వెళ్ళారు. ఇంతవరకూ తిరిగి రాలేదు. ఆమె తన మాయాజాలంతో వాళ్ళను కూడా మోసగించిందని అనుమానిస్తున్నాను. ఇంతకూ ఆమె ఎవరో పూర్తి వివరాలు తెలుసుకోండి. ఆమె రూప సౌందర్యాలు నన్ను విభ్రాంతుడ్ని చేశాయి. ఆమె తన పాటలతోను, చూపులతోను దర్బారులో ఉన్నవాళ్ళనందరినీ వివేక శూన్యులుగా చేసి, జితేంద్రుడ్ని

స్వతంత్రుడ్నిగా చేసింది. ఆమె సుందర రూపం నా కళ్ళ ముందు నృత్యం చేస్తూంది. ఆమె ఎవరో తెలుసుకునే వరకూ నా మనసు కుదుటపడదు,' అన్నాడు మహారాజా ప్రతాప సింహుడు.

'మహారాజా! అంతా అర్థమైంది. ఆమె పేరు సుమతే! రాగమణి చెలికత్తె. ఆమె తప్ప మరొకళ్ళు ఇంత చమత్కారంగా జితేంద్రుడ్ని విడిపించుకు వెళ్ళలేరు,' అన్నాడు నజీరుద్దీన్.

'అయితే, సుమతి రాగమణికంటే సౌందర్యవతే అని చెప్పాలి.'

'కాదు మహారాజా! రాగమణి సుందర రూపం ముందు సుమతి అందం ఎందుకూ పనికిరాదు. అయితే, రాగమణి తర్వాత అందగత్తె ఎవరని అడిగితే సుమతే అని చెప్పాలి. ఆమె జితేంద్రుడ్నే ప్రేమిస్తూందని కూడా తెలుసుకున్నాను.'

మహారాజు నజీరుద్దీన్ చెప్పిన మాటలు విని కనుబొమ లెగురవేశాడు. 'ఏదేమైనా రాగమణి, సుమతి నా అధీనం అయ్యేవరకూ నాకు విశ్రాంతే ఉండదు. ఆ ఇద్దరి గురించీ ఇప్పుడే కీర్తిసేనుడికి ఉత్తరం వ్రాస్తాను,' అన్నాడు.

'మహారాజా! కీర్తిసేనుడు ఉత్తరాన్ని ఖాతరు చెయ్యడు,' అన్నాడు దుర్ముఖి.

'మనకు అందువల్ల కలిగే నష్టమేమీ లేదు. ఉత్తరానికి విలువ ఇవ్వకపోతే సుందరగఢాన్నే వశపరచుకుంటాను,' అని మహారాజు వెంటనే పత్ర లేఖకుడ్ని పిలిపించాడు.

లేఖకుడు రాగానే మహారాజు ఇలా చెప్పాడు: 'సుందరగడం రాజు కీర్తిసేనుడికి నా తరఫున ఉత్తరం వ్రాయండి. రాగమణిని నాకు ఇచ్చి వివాహం చేయాలి. కానుకగా సుమతిని రాగమణి వెంట పంపాలి.'

లేఖకుడు మహారాజు ప్రతాపసింహుడు చెప్పిన విధంగా ఉత్తరం వ్రాశాడు. మహారాజు ఆ ఉత్తరం మీద మొహరు వేసి సద్గుణ తంత్రవేత్తకు ఇచ్చి 'నువ్వే ఇందుకు తగినవాడవు. ఈ ఉత్తరాన్ని కీర్తిసేనుడికి అందచెయ్యి,' అన్నాడు.

సద్గుణ తంత్రవేత్త నిమిషంలోనే సుందరగడం ప్రయాణ మయ్యాడు.

## 23

సుందరగడం మహారాజు కీర్తిసేనుడు దర్బారులో కూర్చుని జితేంద్రుడ్ని వెదకడానికి వెళ్ళి తిరిగి వచ్చిన పరిశోధకులు చెప్పుతున్న మాటలు వింటున్నాడు. వారి మాటలవల్ల మహారాజు విచారం కొంచెం కూడా తొలగలేదు; సరి కదా, విచారంతో పాటు దిగులు కూడా ఎక్కువ కాసాగింది. ఎందరు వచ్చి చెప్పుతున్నా జితేంద్రుడు ఎక్కడా కనిపించ లేదన్న మాట తప్ప మహారాజు మరొక వార్త వినలేకపోతున్నాడు. కొందరు వచ్చి జితేంద్రుని సమాచారం తెలియలేదన్నారు. మరికొందరు వచ్చి వాళ్ళు పరిశోధించిన ప్రాంతాల్లో ఎక్కడా జితేంద్రుడు లేడన్నారు. ఎవరి నోటినుంచీ కూడా ఆశాపూరిత మైన ఒక్క మాట అయినా వినలేకపోయాడు మహారాజు. అతను బలభద్ర దేవుని చూసి 'మంత్రీ! ఇక మన గౌరవం దక్కే పరిస్థితి కనిపించడం లేదు. ఇన్ని రోజులు గడిచినా జితేంద్రుడ్ని విడిపించుకోలేక పోయాం. కనీసం అతను ఎక్కడున్నదీ; ఎలా ఉన్నదీ కూడా తెలుసుకోలేక పోయాము. ప్రచండ దుర్గం గూఢచారులే అతన్ని బంధించి ఉంటారని నేను పూర్తిగా అనుమానిస్తున్నాను. అతన్ని వెదకడానికి నేనే స్వయంగా బయలుదేరుతాను. ఈ పరిశోధకులను నమ్ముకుని కూర్చుంటే లాభం లేదు,' అన్నాడు.

మహారాజా కీర్తిసేనుని మాటలు విని బలభద్ర దేవుడు చాలా వ్యాకులపడ్డాడు. 'మహారాజా! తొందరపడకండి. మీరు రాజ్యాంగాన్ని విడిచిపెట్టి జితేంద్రుడ్ని వెదకడంలో నిమగ్నులైతే, ఇక్కడ దేశంలో అరాజకం ప్రబలిపోతుంది. ముఖ్యంగా ముసల్మానులు దుర్ముఖికి తోడై, మనలను వంచించ డానికి చూస్తున్న ఈ సమయంలో మనం చాలా వివేకంగా మెలగాలి. జితేంద్రుడు చిన్నవాడైనా చాలా తెలివైనవాడు. అతనేదో విధంగా శత్రువుల చేతుల్లోంచి తప్పించుకుంటాడు. తప్పకుండా తిరిగి వస్తాడు. మీరేమీ ఆందోళన చెందకండి. ఈరోజునే కొందరు పరిశోధకులను ప్రచండ దుర్గం పంపిస్తాను. వాళ్ళు తిరిగి వచ్చాక, అప్పుడు ఏమి చేయవలసిందీ ఆలో చిద్దాము,' అన్నాడు వినయంగా.

'మంత్రి ఉద్దేశం మహారాజుకు తృప్తి కలిగించ లేదు. అతను మంత్రిని చూసి ఏదో అనబోతుండగా 'మహారాజా! మహారాజా! ఆయన వస్తున్నారు,' అన్నాడు చోబ్దారు ఉత్సాహంగా. చోబ్దారు సభాగౌరవాన్ని మరచి, సాంప్ర దాయాన్ని విడచి అరచి చెప్పడంతో మహారాజుకు చాలా చికాకు కలిగింది. అతను కోపంతో చోబ్దారు వైపు తల త్రిప్పాడు. 'మహారాజా! అలా చూడండి,' అన్నాడు మళ్ళీ చోబ్దారు సంతోషంతో.

జితేంద్రుడు భుజం మీద మూటతో దర్బారులో ప్రవే శించి మహారాజు ముందుకు వచ్చి, మూట క్రిందకు దించి, రెండు చేతులూ జోడించి నమస్కరించాడు.

మహారాజు కీర్తిసేనుడు జితేంద్రుడ్ని చూడగానే పరమా నందంగా బలభద్రుని చూసి 'మంత్రీ! మన జితేంద్రుడు!' అన్నాడు. తర్వాత జితేంద్రుని కూర్చోమని చేతితో సౌంజ్ఞ చేశాడు.

జితేంద్రుడు బలభద్ర దేవుని ప్రక్కగా కూర్చుని చిరునవ్వుతో దర్బారులో ఉన్న వాళ్ళనందరినీ ఒకసారి కలయ చూశాడు. అప్పటి వరకూ విచారంగా ఉన్న దర్బారంతా జితేంద్రుడ్ని చూడగానే కళకళలాడిపోయింది. జితేంద్రుడు తన కళ్ళతోనే అందరినీ పరామర్శించాడు. ఆనందోద్వేగాల వల్ల దర్బారులో లేచిన కలకలం నెమ్మదిగా తగ్గుముఖం పట్టింది.

అంతలో మహారాజు 'జితేంద్రా! ఇన్ని రోజులూ ఎక్కడున్నావు? ఈ మూట ఏమిటి?' అన్నాడు. మహారాజు మాట వినగానే దర్బారులోని వాళ్ళంతా మౌనం వహించారు. జితేంద్రుడు ఏమి చెపుతాడో వినాలని అందరికీ కుతూహలంగానే ఉంది. మహారాజుతోపాటు అందరూ జితేంద్రుని వైపే చూడసాగారు.

జితేంద్రుడు లేచి నిలబడ్డాడు. 'మహారాజా! శత్రు గూఢచారుల మోసంలో చిక్కుకున్నాను. వాళ్లు నన్ను ప్రచండదుర్గం కోటలో బంధించారు. అక్కడనుంచి తప్పించుకు రావడానికి చాలా కాలం పడుతుందనుకున్నాను. కాని మహారాజా! నాయందు దయ కలిగిన ఒక దేవత నన్ను వెదుక్కుంటూ అక్కడకు వచ్చింది. తన అపార ప్రజ్ఞా విశేషంతో ప్రతాపసింహుడ్ని దాసుడ్ని చేసుకుంది. తర్వాత తన తెలివినుపయోగించి నన్ను విడిపించింది. ఈ కానుక నిచ్చి మీకు సమర్పించమని కోరింది!' అంటూ అతను తెచ్చిన మూటను చూపించాడు.

'జితేంద్రా! నిన్ను విడిపించిన ఆ దేవత ఎవరు? ఆ మూటలో ఉన్నదేమిటి?' మహారాజు ఆశ్చర్యంగా అడిగాడు.

'మహారాజా! ఆ దేవత మీ అభిమానానికి పాత్రురాలే. ఆమెను గురించి మరొకప్పుడు చెపుతాను.' అని జితేంద్రుడు

మూట విప్పాడు. ఆ మూటలో తెలివి లేకుండా పడి ఉన్న పరమానందం, కృష్ణదాసులను చూసి దర్బారులో వాళ్ళంతా ఆశ్చర్యపోయారు. మహారాజు కూడా కుతూహలంగా ఆ ఇద్దరినీ చూడసాగాడు. జితేంద్రుడు మహారాజు వైపు చూసి 'మహారాజా! నన్ను బంధించినందుకు ప్రతీకారంగా ఈ గూఢచారుల నిద్దరినీ మన వశం చేసిందా దేవత! ఆదేవత కరుణ వల్లే నేనింత త్వరలో మిమ్మల్ని చూడగలిగాను,' అంటూ ఆ ఇద్దరినీ చూపించాడు.

'జితేంద్రా! నిన్ను చూడగానే నా విచారం తొలగి పోయింది. నువ్వు తప్పించుకు రావడమే కాకుండా శత్రు గూఢచారులను బంధించి తీసుకు వచ్చావు. చాలా ఆనందంగా ఉంది. సంతోషపూర్వకంగా ఇస్తున్న ఈ బహుమతిని తీసుకో,' అని మహారాజు తన వ్రేలినున్న వజ్రపుటుంగరం జితేంద్రునికి బహుమతిగా ఇచ్చాడు.

జితేంద్రుడు ఉంగరం తీసుకొని కళ్ళకద్దుకున్నాడు. దాన్ని తంత్రాల సంచిలో భద్రపరచి 'మహారాజా! వీళ్ళను ఖైదు చేసి బలమైన కాపలా ఉంచాలి. సెలవైతే ఆ ఏర్పాట్లు చేసి వస్తాను,' అన్నాడు.

'జితేంద్రా! నువ్వు చాలా అలసిపోయి ఉన్నావు. నువ్వు కొంచెం విశ్రాంతి తీసుకో. ఆఁ! ఇక్కడ మన రేవతి కూడా ఇద్దరు గూఢచారులను బంధించింది. ఆమె తెలివివల్లే రాజ కుమారి శత్రువులకు చిక్కకుండా కాపాడబడింది. రేవతి చమత్కారంగా పట్టుకున్న గూఢచారులిప్పుడు మన ఆధీనం లోనే ఉన్నారు. ఇద్దరినీ ఖైదు చేసి, కట్టుదిట్టమైన కాపలా పెట్టాము. ఈ గూఢచారులను కూడా వాళ్ళతోపాటు అక్కడే ఖైదు చేయిస్తాను,' అని మహారాజు ఆ గూఢచారుల

నిద్దరినీ తీసుకు వెళ్ళి బంధించవలసిందిగా సైనికులకు ఆజ్ఞాపించాడు.

జితేంద్రుడు ఆ ఇద్దరు గూఢచారులకూ తెలివి కలిగించాడు. సైనికులు గూఢచారుల చేతులకు బేడీలు వేయడానికి ముందుకు వస్తున్నారు.

తెలివి కలగడంతోనే కళ్ళు విప్పిన గూఢచారులు పరమానందం, కృష్ణదాసులిద్దరూ అనుమానాశ్చర్యాలతో ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు.

జితేంద్రుడు వాళ్ళను చూసి నవ్వుతూ 'మీరిపుడు ప్రచండ దుర్గంలో కాదు, సుందరగడంలో ఉన్నారు. నేనింత దూరం ఒంటరిగా రాలేక మీ ఇద్దరినీ కూడా వెంట తీసుకు వచ్చాను. విడిదిలోకి వెళ్ళి విశ్రాంతిగా కాలం గడపండి,' అన్నాడు ఎగతాళిగా.

జితేంద్రుని మాటలు విని పరమానందం, కృష్ణదాసులు కొంచెం కలవరపడ్డారు. అప్పటికే సైనికులు వారిని సమీపించారు. చేతులకు బేడీలు వేయడానికి సిద్ధంగా ఉన్నారు. అంతలోనే పరమానందం తన తంత్రాల సంచిలో చెయ్యి పెట్టాడు. చిన్న డబ్బా నొకదాన్ని పైకి తీసి, మూత తెరచాడు. డబ్బా నిండా ఉన్న పచ్చని పొడి నిగనిగలాడుతూంది. అతనా పొడిని గుప్పెటలోకి ఒంచుకొని తన చుట్టూ జల్లాడు. అంతే!...కన్ను మూసి తెరచే లోపల దర్బారంతా పాములతో నిండిపోయింది. రకరకాల పాములు పడగలు విప్పి ఆడసాగాయి! నల్ల త్రాచులు, గోధుమ త్రాచులు, బుసలు కొడుతూ దర్బారంతా కలతిరుగుతున్నాయి. అగ్గి పొడలు, బగ్గి పొడలు, కుళ్ళు పొడలు - దర్బారులో ఆ మూల నుంచి ఈ మూలకు, ఈ మూలనుంచి ఆ మూలకు దూకు

తున్నాయి. కొండచిలువలు స్తంభాలకు చుట్టుకుని విరుచు కుంటున్నాయి.

గూఢచారులకు బేడీలు వేయడానికి సిద్ధపడిన సైనికులు నేల మీద పడి దొర్లుతున్నారు. వాళ్ళను పెద్ద పెద్ద కొండ చిలువలు చుట్టబెట్టుకొని దూరంగా దొర్లించుకుపోతున్నాయి.

దర్బారులో ఉన్న వాళ్ళందరూ ఆదృశ్యం చూసి స్తంభించి పోయారు. అందరి శరీరాలూ భయంతో కంపించిపోతున్నాయి. మహారాజు కూడా ఆందోళనతో సింహాసనం మీంచి లేచి నిలబడ్డాడు.

దర్బారంతా కేకలతోనూ, అరుపులతోనూ నిండిపోయింది. అందరూ ఒక్కసారే దర్బారులోంచి పారిపోవడానికి ప్రయత్నించడంలో ఒకరి మీద ఒకరు పడిపోతూ, తూలిపోతూ క్రిందు మీదులైపోతున్నారు.

మహారాజు కూడా తొందరగా సింహాసనం మీంచి దిగబోతున్నాడు. అంతలోనే ఎక్కడి పాములక్కడే మాయమై పోయాయి! మహారాజుకదంతా చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. అతను సింహాసనం మీద కూర్చుని, దర్బారులో ఉన్న వాళ్ళనందరనూ పరిశీలించి చూశాడు. అతనికి గూఢచారులక్కడ కనిపించలేదు. అంతే కాదు, జితేంద్రుడు కూడా దర్బారులో లేకపోయేసరికి మహారాజు అదరిపడ్డాడు. 'మంత్రీ! ఏమిటీమాయ! గూఢచారులు తప్పించుకుపోయారు. జితేంద్రుడు కూడా మళ్ళీ ఏమైపోయాడో తెలీడం లేదు. ఈ పాములన్నీ ఎక్కడనుంచి వచ్చాయి? ఎలా పారిపోయాయి?' అన్నాడు.

'మహారాజా! ఏమి చెప్పమంటారు? మనం పాముల బారి నుంచి తప్పించుకోవడానికి ప్రయత్నించే లోపలే గూఢచారులు కనిపించకుండా పోయారు. జితేంద్రుడ్ని మాత్రం నేను

చూడలేకపోయాను. అతను వాళ్ళకు తెలివి కలిగించి చాలా పొరపాటు చేశాడు,' అన్నాడు బలభద్ర దేవుడు.

పాములు అంతరించడంతో దర్బారులో వాళ్ళంతా కొంచెం నిమితపడి తమ తమ స్థానాల్లో కూర్చున్నారు. ఎవరి నోటి నుంచీ మాట రావడం లేదు. అందరూ మహారాజునీ, మంత్రినీ చూస్తూ వారి సంభాషణ వింటూ ఊరుకున్నారు.

'మంత్రీ! జితేంద్రుడు ఇప్పుడిక శత్రువులకు చిక్కితే విడుదల కావడం కష్టం. వెంటనే మన సైనికులను పట్టణం చుట్టూ కాపలా పెట్టండి. ఎవరూ పట్టణం దాటి బయటకు వెళ్ళకుండా కట్టడి చేయండి. ప్రతి ఇంటినీ శోధించి, గూఢ చారులను బంధించండి. అక్కడే జితేంద్రుడు కూడా ఉంటాడు. విడిపించి తీసుకు రండి. త్వరగా వెళ్ళండి,' అన్నాడు మహారాజు.

మంత్రి బలభద్ర దేవుడు లేచి నిలబడ్డాడు. అంతలో జితేంద్రుడు దర్బారులో ప్రవేశించాడు. అతను రెండు చేతుల తోనూ ఇద్దరు గూఢచారులను ఎత్తుకుని వస్తున్నాడు. తెలివి తప్పిపోయిన గూఢచారుల శరీరాలు ఊగులాడుతున్నాయి.

మహారాజుతో పాటు దర్బారులో ఉన్నవాళ్ళంతా జితేం ద్రుడిన్ని, అతని చేతుల్లో ఉన్న గూఢచారుల్ని చూసి సంతో షాశ్చర్యాలతో గుస గుసలు ప్రారంభించారు.

జితేంద్రుడు గూఢచారులను సైనికులకు అప్పగించి, మహా రాజుకు నమస్కరించాడు. 'మహారాజా! నిర్లక్ష్యానికి మన్నిం చండి. వీళ్ళింత దారుణానికి దారి తీస్తారనుకోలేదు,' అన్నాడు.

'జితేంద్రా! దర్బారులోకి అన్ని పాములెలా వచ్చాయి? పారిపోయిన వీళ్ళు మళ్ళీ ఎలా దొరికారు?' అన్నాడు మంత్రి.

'ఈ గూఢచారులు తెలివి రాగానే పరిస్థితిని అర్థం చేసు కున్నారు. ఖైదులో పెట్టబడ్డాక పారిపోవడం కష్టమను

కున్నారు. చిన్న ఇంద్రజాలం చేసి మనలను భయపెట్టి తప్పించుకు పోవాలనుకున్నారు. ఆ పాములన్నీ వీళ్ళ ప్రభావం వల్లే వచ్చాయి. అవన్నీ నిజమైన పాములు కావు. కాని, కొన్ని క్షణాల వరకూ అవి మామూలు పాముల్లాగే ఉండి, చూచే వాళ్ళను హడలగొడతాయి. తర్వాత ఎక్కడివక్కడే మాయమైపోతాయి.

'వాళ్ళు సృష్టించిన ఆ పాములను చూడగానే మీ అందరితోపాటు నేనూ కలవరపడ్డాను. అయితే భయంవల్ల కాదు; మీరందరూ భయాందోళనల్లో మునిగిపోయి ఉండగా వాళ్ళు పారిపోతారని అనుమానించాను. వెంటనే నేను దర్బారులోంచి బయటకు వెళ్ళిపోయాను. ద్వారం దగ్గరున్న సిపాయిలను హెచ్చరించి, నేను కూడా అక్కడే నిలబడ్డాను. అంతలో ఈ గూఢచారులిద్దరూ పరుగెత్తుకుంటూ అవతలకు వచ్చారు; మన సిపాయిలు అతి చురుగ్గా తమ కత్తులను వాళ్ళ గుండెలకు నాటించారు. తలవని తలంపుగా అడ్డు తగిలిన సిపాయిలను వాళ్ళు ఎదిరించడానికి సమకట్టే లోపల నేను మత్తుమందుతో తెలివి తప్పించాను. మహారాజా! భయాందోళనలతో కలవరపడుతున్న మీ అందరినీ విడిచి పెట్టి నేను నిర్లక్ష్యంగా బయటకు వెళ్ళినందుకు క్షమించండి. ఈ గూఢచారులను బంధించాలనే తలంపుతోనే అలా చేశాను,' అన్నాడు జితేంద్రుడు.

'జితేంద్రా! నీ తెలివి అపారం. వాళ్ళ ఎత్తులు నీ యుక్తి ముందు ఎందుకూ పనికిరావు,' అని మహారాజు ఆ గూఢచారుల నిద్దరినీ ఖైదు చేయమని సైనికులకు ఆజ్ఞాపించాడు.

ఈసారి జితేంద్రుడు వాళ్ళ దగ్గరున్న తంత్రాల సంచులను, ఆయుధాలను వశపరచుకుని, చేతులకు జేడీలు వేసిన తర్వాత తెలివి కలిగించాడు. సైనికులా గూఢచారుల నిద్దరినీ

తీసుకుపోయి రేవతి పట్టుకున్న గూఢచారులున్న ఖైదులో బంధించారు.

సైనికులు పరమానందాన్ని, కృష్ణదాసుని దర్బారులోంచి తీసుకుపోగానే జితేంద్రుడు తన కుర్చీ దగ్గరకు వెళ్ళి నిలబడి 'మహారాజా! చిన్న మనవి: మీరు అనుమతిస్తే వీరగడం ఒక సారి వెళ్ళి వస్తాను,' అన్నాడు.

'తప్పకుండా వెళ్ళిరా. నీకోసం అక్కడ కూడా వెదికించాను. నువ్వు కనిపించడం లేదన్న విషయం తెలియగానే మీ తల్లి తండ్రులెంతో దిగులు పడి ఉంటారు. గజపతి మహారాజు కూడా నీకోసం విచారిస్తారు. తొందరగా వెళ్ళి అక్కడి వారిని ఆనందపరచు. కాని జితేంద్రా! వెంటనే రావాలి సుమా!' అన్నాడు మహారాజు.

'మహారాజా! నేను అక్కడ ఉన్నా, నా మనస్సెప్పుడూ సుందరగడంలోనే ఉంటుంది. సహృదయుడైన గుణసాగర్ నాకోసం తపించిపోతూంటాడు. అతనికి కనిపించి మరు నిమిషంలో తిరిగి వస్తాను.'

'వద్దు-వద్దు. అలా కాదు. నా ఆత్రుతకొద్దీ తొందరగా రమ్మన్నాను. అలా చేయడం ధర్మం కాదు. తల్లి తండ్రుల దిగులు తీర్చి, మహారాజును సంతోషపరుస్తూ కొద్ది రోజులు అక్కడే ఉండు. అలా అన్నానని ఎక్కువ కాలం ఉండిపోకూడదు,' మహారాజు బలభద్ర దేవుని వైపు చూశాడు. 'మంత్రీ! జితేంద్రుణ్ణి ఒక్కడినీ పంపించడానికి నా మనస్సంగీకరించడం లేదు. మీరు కూడా అతనితో కలిసి బయలుదేరండి. నా తరఫున మహారాజుకు, రాజకుమారునికి కానుకలు కూడా అంద చేయండి,' అన్నాడు.

ఆ రోజునే జితేంద్రుడు, బలభద్ర దేవుడు వీరగడం ప్రయాణమయ్యారు. వారి కూడా కొందరు సైనికులు కొను కలతో బయలుదేరారు.

జితేంద్రుడు వీరగడం వెళ్ళే ముందు సుమతి నొకసారి కలుసుకోవాలనుకున్నాడు. మహారాజు తనకు బహూకరించిన ఉంగరాన్ని ఆమెకు సమర్పించాలనుకున్నాడు. కాని, రాకుమారి భవనంలో ఉన్న సుమతిని చూడ్డానికే అతనికి సావ కాశం కలగలేదు.

## 24

జితేంద్రుడు రాజ దర్బారులో ప్రవేశించిన సమయంలోనే సుమతి రాజకుమారి రాగమణి భవనంలో కాలు పెట్టింది.

సుమతిని చూడగానే రాజకుమారి పరమ సంతోషంతో ఎదురు వచ్చి గట్టిగా కౌగలించుకుంది. కొంతసేపయ్యాక సుమతి తను జితేంద్రుడ్ని విడిచిపెట్టడానికి వెళ్ళింది లగా యతు తిరిగి వచ్చే వరకూ జరిగిన విషయమంతా వివరించి చెప్పింది. తను ప్రతాపసింహుని దర్బారులో పాట పాడు తూన్నపుడు జితేంద్రుడు వీణ వాయించిన విధానాన్ని అభి నయంతో చూపించి - రాగమణిని, రేవతిని కడుపుబ్బ నవ్విం చింది. తర్వాత ఆమె రాగమణిని చూసి 'రాజకుమారీ! నేను ఇక్కడ లేని సమయంలో మీ కే కష్టం కలుగలేదు కదా? శత్రువులు తమ ఎత్తులతో మీకెట్లాంటి ఆపదను కలిగిస్తారో అని భయపడిపోయాను. ఏమీ విశేషాలు లేవు కదా?' అని- 'ఏమే రేవతీ! నీ భూతం ప్రియుడు మళ్ళీ కనిపించాడా?' అంది రేవతితో పరిహాసంగా.

'సుమతీ! నువ్వు పరిహాసంగా అడుగుతున్నా, నేను నిజమే చెబుతున్నాను. అతను ప్రియుడో, పిడుగో తెలియదు కాని, నువ్వు ఇక్కడ నుంచి వెళ్ళిన రాత్రే కనిపించాడు. రాత్రి

పది గంటలౌతుంది. నువ్వు వెళ్ళిన దగ్గరనుంచి రాజకుమారి వ్యాకులంగా ఉండడం చూసి, ఏవేవో కబుర్లు చెపుతూ పూలతోటలోకి తీసుకు వెళ్ళాను. ఆమెను చలువరాతి మీద కూర్చుండబెట్టి, మంచి మంచి కథలు చెప్పడం మొదలు పెట్టాను. ఏమి చేసినా, ఎన్ని చెప్పినా రాజకుమారి విచారం తొలగలేదు. ఆమె ముఖం వికసించలేదు. ఆమె మౌనంగా అలాగే కూర్చుంది. నేను ఏమి చేస్తున్నానో, ఏమి చెపుతున్నానో వినే స్థితిలో కూడా లేకుండా పోయింది. ఆకాశంలోకి లోతుగా చూస్తూ, అప్పుడప్పుడు నిట్టూర్పులు విడుస్తూ, నేనక్కడ ఉన్నాననే విషయాన్నే మరచిపోయి కంట తడి పెట్టసాగింది. ఆమె దుఃఖానికి కారణం తెలుస్తూనే ఉంది. జితేంద్రుడు లేనిదే గుణసాగర్ తనకు కనిపించడు; జితేంద్రుడ్ని తీసుకు రావడానికి నువ్వు బయలుదేరావు. అటు జితేంద్రుడు, ఇటు నువ్వు - ఇద్దరూ కూడా తనకు దూరమై పోతున్నందుకు ఆమె ఆరాటపడింది. మీ ఇద్దరూ లేనిదే తన ప్రియుడు గుణసాగర్ తన కళ్ళకు కనిపించడని ఆందోళన చెందింది. ఆ ఆవేదనతో ఆమె ఆలోచిస్తూ ఈ లోకాన్నే మరచింది. నా ప్రయత్నాలన్నీ విఫలం కావడంతో నా కింకేమీ తోచక నిరుత్సాహంగా కూర్చున్నాను. అంతలో నాకొక ఆలోచన తట్టింది. ఆమెను అక్కడే విడిచిపెట్టి, చప్పుడు కాకుండా నేను తిరిగి భవనంలో ప్రవేశించాను. రాజకుమారిని కలుసుకోడానికి వచ్చిన గుణసాగర్ ఒకప్పుడు తిరిగి వెళ్ళడానికి సావకాశం లేక, తన దుస్తులు ఇక్కడ విడచి, సైనిక వేషంలో బయటపడ్డాడు. గుర్తుందా? ఆదుస్తులు తీసి ధరించాను. అద్దం ముందు నిలబడి, తంత్రాల సంచి సహాయంతో తొందరగా రాజకుమారుడు గుణసాగర్‌లా తయారయ్యాను. ఆ రూపంలో రాజకుమారిని సమీపించి, కాసేపు

ఆమెను సంతోషపరచాలనే తలంపుతో వెంటనే తోటలో ప్రవేశించి రాజకుమారి కూర్చున్న వైపు నడుస్తున్నాను. అంతలో ఎవరో ఒక చేత్తో నా భుజం పట్టుకుని, రెండవ చేతితో నా నోరు నొక్కారు. రాజకుమారిని ఆనందపరచాలనే ఉబలాటంలో మునిగిపోయిన నాకు వివేకం లేకుండా పోయినందుకు చాలా విచారించాను. భయంతో నన్ను పట్టుకున్న ఆ చేతులను తొలగించడానికి పెనుగులాడసాగాను. అంతలో నా చెవి దగ్గర కొన్ని మాటలు అతి నెమ్మదిగా వినబడ్డాయి. 'ఏమిటీ వేషం? వేషాల్లో మునిగి రాజకుమారిని పోగొట్టుకోవాలనుకుంటున్నావా? శత్రువులు భవనంలో ప్రవేశించడానికి సిద్ధంగా ఉన్నారు. రాజకుమారిని ఎత్తుకు పోవడానికి వ్యూహాలు పన్నుతున్నారు. నీ వేషాలింతటితో చాలించి, రాజకుమారిని రక్షించుకో!' ఆ మాటలు వినగానే నేను ఆశ్చర్యపోయాను. పెనుగులాడ్డం మాని, ఆ వ్యక్తి ఎవరో తెలుసుకోవాలని వెనక్కి తిరిగాను. నేను తిరిగానని చెప్పే కంటే, అతనే నన్ను తన వైపుకు త్రిప్పాడంటే మంచిది. అతనలా చేయగానే నా కళ్ళు అతని మీద పడ్డాయి. భయంతో గట్టిగా అరవబోయాను. కాని, నోటి నుంచి చిన్న శబ్దం కూడా రాలేదు. నా స్థితిని అతను గ్రహించాడనుకుంటాను. 'రేవతీ! భయపడకు. నేను దయ్యాన్నీ కాను; భూతాన్నీ కాను. మనిషినే! నిన్ను హెచ్చరించడానికి వచ్చాను. ఈ రాత్రి సమయంలో రాజకుమారిని ఇలా ఒంటరిగా తోటలో విడిచిపెట్టడం ఏమైనా బాగుందా? సుమతి నిన్ను నమ్మి రాజకుమారిని నీకు అప్పగించింది. ఆ బాధ్యతను నువ్వు ఎంత జాగ్రత్తగా నిర్వహించాలి? రాజకుమారిని వెంటనే భవనంలోకి తీసుకువెళ్ళు. సుమతి వచ్చేవరకు ఆమెను భవనంలోంచి బయటకు రానీయకు. నీ చాతుర్యం, చమత్కారం -

రాజకుమారిని రక్షించుకోవడంలో తెలుస్తుంది! నువ్వు అజా గ్రత్తగా ఉంటే, రాజకుమారి మనకు దూరమైపోతుంది. జాగ్రత్త! ఏమాత్రం పొరపాటు జరిగినా నీ పీక నా చేతుల్లో నలిగిపోతుంది,' అన్నాడు.

'నాకు అప్పటికి కొంత భయం తీరింది. అతన్ని బాగా నిదానించి చూశాను. అతను నా వంక చూస్తూ నవ్వు తున్నాడు. అతని నవ్వు చాలా వికృతంగా కనబడింది. ఎత్తు పళ్ళు, ప్రక్క కోరలు, నల్లని శరీరం - మనకు ముందు కని పించిన ఆ భూతం యాపమే అది! ఆ ఆకారం చూసినప్పుడు మళ్ళీ కొంచెం భయం కలిగింది. కాని, అది అంత లెక్కలోనిది కాదు. కాసేపు ఆలోచించాను. అతను పరిచితుడు కాక పోయినా, శత్రువర్గంలోనివాడు కాడని నమ్మకం కలిగింది. 'ఎవరు నువ్వు? మా కష్ట సుఖాలతో నీకేం పని?' అన్నాను నెమ్మదిగా. • అతను నేనడిగిన మాటలు విని మానంగా నవ్వాడు. 'నేనెవరినో తర్వాత తెలుస్తుంది. రాజకుమారి నిద్ర పోయే గదిలోకి ఎవరూ ప్రవేశించడానికి వీల్లేకుండా తగిన ఏర్పాటేదైనా చెయ్యి. దాసీలనెవరినీ నమ్మకు. రాజకుమారిని ఏ నిమిషంలోనూ విడిచిపెట్టకు. నేను చెప్పిన మాటలన్నీ బాగా జ్ఞాపకం ఉంచుకో! అని...' అక్కడివరకూ చెప్పి ఊరుకుంది రేవతి.

రాజకుమారి రాగమణి రేవతి చెప్పిన మాటలు విని ఆశ్చర్యపోయింది. రేవతి ఆమెకా విషయం అంతవరకూ చెప్పకపోయినందుకు కొంచెం కోపం కూడా వచ్చింది.

'ఊఁ! తర్వాత ఏమి జరిగింది?' అంది సుమతి ఉత్సా హంగా.

రేవతి ఏమీ సమాధానం చెప్పలేదు. తల ప్రక్కకు త్రిప్పుకుంది.

'మాట్లాడవేం?' రెట్టించింది సుమతి.

'ఏం మాట్లాడమంటావ్? మొదటిలానే—'

'—దూరంగా తీసుకుపోయి, ముద్దు పెట్టుకు విడిచిపెట్టాడంటావ్! అంతేనా?' సుమతి నవ్వుతూ మాట పూర్తి చేసింది.

రాజకుమారి పకపకమని నవ్వింది.

రేవతి సిగ్గుతో తల దించుకుంది.

రాజకుమారి నవ్వు ఆపుజేసుకుంటూ - 'అయితే, నీ భూతం ప్రియుని సహాయంవల్లే ఆ ఇద్దరినీ బంధించావన్నమాట?' అంది.

సుమతి ప్రశ్నార్థకంగా రేవతి ముఖంలోకి చూసింది. రేవతి నెమ్మదిగా గూఢచారులను బంధించడానికి తను చేసిన ప్రయత్నాలన్నీ వివరంగా చెప్పింది.

రేవతి ధైర్యానికి, సాహసానికి, గూఢచారులను బంధించడంలో ఆమె చూపిన చమత్కారానికి సుమతి ఆశ్చర్యపడకుండా ఉండలేకపోయింది. 'రేవతీ! నా గౌరవాన్ని కాపాడావు. రాజకుమారి ఆపదను తొలగించావు. శత్రువుల అహంభావాన్ని అణచావు. తెలివైనదానవని రుజువుపరచుకున్నావు,' అంది.

ముగ్గురూ చాలాసేపటివరకూ మాట్లాడుకుంటూ సంతోషంగా కాలం గడిపారు.

ఆ ముగ్గురూ అలా మాట్లాడుకుంటూండగానే దాసి కోమలి వచ్చి రాగమణి ఎదుట నిలచింది. 'అమ్మా! జితేంద్రుడు మన మంత్రిగారితో కలిసి వీరగడం వెడుతున్నారు. వారి వెంట విలువైన కానుకలు కూడా తీసుకు వెడుతున్నారు,' అంది.

## 25

సుందరగడంలో బయలుదేరిన జితేంద్ర, బలభద్ర దేవులు సైని కులు వెంట వస్తుండగా సాయంకాలానికి వీరగడం సమీ పానికి చేరుకున్నారు.

జితేంద్రుడు బలభద్ర దేవుడ్ని చూసి 'మనం ఇపుడు వీర గడంలో ప్రవేశించినా మహారాజు దర్శనం లభించదు. ఉదయం వరకూ ఇక్కడే డేరాలు వేసి మకాం చేద్దాము. సరిగ్గా దర్బారు వేళకు పట్టణంలో ప్రవేశించి దర్బారుకు వెడదాము. అందువల్ల మనం అందరినీ ఒక్క చోటనే చూడగలం,' అన్నాడు.

బలభద్ర దేవుడు జితేంద్రుని మాటకు ఏమీ అడ్డు చెప్ప లేదు. ప్రయాణం నిలుపు చేసి, గుడారాలు వేయమని అతను వెంటనే సైనికులకు ఆజ్ఞాపించాడు.

తెల్లవారింది. జితేంద్రుడు, బలభద్ర దేవుడు సరియైన సమయానికి వీరగడం చేరి రాజ దర్బారులో ప్రవేశించారు.

మహారాజు గజపతి సింహాసనంమీద విచారంగా కూర్చు న్నాడు. మహారాజు సింహాసనానికి ప్రక్కనే ఉన్న ఆసనం మీద రాజకుమారుడు గుణసాగర్ కూర్చున్నాడు. అతను చాలా గంభీరంగా ఉన్నాడు. అతని కళ్ళల్లో దృఢమైన నిశ్చయం ద్యోతకమౌతూంది. దర్బారులో ఉన్న వారంతా మౌనంగా ఉండి గుణసాగర్‌ని సముదాయిస్తున్న మంత్రి ధీరేంద్రుని ముఖంలోకి చూస్తున్నారు.

'రాజకుమారా! ఆలోచించండి. నా మాట విని కొద్ది రోజులు ఓపిక పట్టండి. జితేంద్రుడు మీకు ప్రాణస్నేహితు డైతే; నాకతడు ఒక్కగా నొక్క కొడుకు. జితేంద్రుడు కనిపించకపోయినందుకు మీకు కలుగుతున్న బాధ నాకు

తెలుసు. కన్న కొడుకు కనిపించకపోతే తండ్రి ఎంత బాధ పడతాడో ఊహించండి. మీరే అతనికోసం అంత బాధ పడుతూంటే, నాకెంత బాధగా ఉంటుందో ఆలోచించండి. మీరు మహారాజు మనస్సును కూడా కలవర పరుస్తున్నారు. ఓర్పును కోల్పోవడం వీర లక్షణం కాదు. అయినా అత నెక్కడున్నాడో తెలియంది మీరెవరితో యుద్ధం చేస్తారు? అత నెక్కడ బంధించబడ్డాడో తెలియదు; అతన్నెవరు బంధించారో తెలియదు; ఇక మీరెవరితో పోరాడతారు?' అన్నాడు ధీరేంద్రుడు.

'ప్రచండ దుర్గం మహారాజు ప్రతాపసింహునితోనే పోరాడతాను. అతని గూఢచారులే జితేంద్రుడ్ని బంధించి తీసుకు పోయారు. అందులో ఇంకేమీ సందేహం లేదు. నాకు మహారాజు అనుమతి నివ్వకుండా మీరు అంతరాయం కలిగిస్తున్నారు. నా వీరత్వాన్ని మీరు శంకిస్తున్నారు. నేను కళ్ళెదుట లేకపోతే మహారాజు బాధ పడతారని మీరు నా ప్రయత్నానికి అవాంతరం కలిగిస్తున్నారు? కొడుకుయందుండే మమకారం అంత గొప్పదని తెలిసుండీ కూడా మీరు జితేంద్రుడ్నెందుకు దూరం చేసుకున్నారు? అతనెవరి గురించి ఈ ఆపదలో చిక్కుకున్నాడు? ఎవరి మాటమీద అతను వారొకరికి సహాయం చేయడానికి వెళ్ళాడు? పరుల సుఖంకోసం అతను కష్టాల్లో ఎందుకు చిక్కుకోవలసి వచ్చింది? మహారాజు కీర్తిసేనుడు మన సహాయం కోరాడు. అందుకు అంగీకరించి మన మహారాజు జితేంద్రుడ్ని సుందరగడం పంపించారు. అప్పుడు మీ పుత్ర ప్రేమ ఏమైంది? మీరెందుకు ఆనాడు అభ్యంతర పెట్టలేదు? మీరు కూడా అతనికన్నో నీతులు చెప్పి సంతోషంగా పంపించారే! మీ కొడుకు వీరుడు కావాలనా? అతని పేరు ప్రఖ్యాతులు నలుమూలలా

వ్యాపించాలనా? జితేంద్రుని శక్తి సమర్థతలు దేశ దేశాల్లో వెల్లడి కావాలనా? అలాంటి స్వార్థ బుద్ధితోనే మీరతన్ని పంపించారా? మాట్లాడరేం? మీరే ఇప్పుడు ఆలోచించండి. మీకు జితేంద్రునిమీద ప్రేమ లేదని చెప్పగలరా? అతని గురించి మీరు లోలోపల దుఃఖించడం లేదని అనగలరా? మంత్రివర్యా! మహారాజుకోసం అవసరమైతే మీరు సర్వాన్నీ త్యాగం చేయడానికి వ్రతం పట్టారు. మీ ప్రతిజ్ఞకు భంగం రాకుండా, మహారాజు మాట ననుసరించి జితేంద్రుడ్ని పరులకు సహాయం చేయడానికి పరదేశం పంపించారు. పరుల సుఖం కోరి మీరు కష్టాల పాలవవచ్చు; మా కారణంగా మీకు కలిగిన కష్టాలను తొలగించడానికి మేము ప్రయత్నించకూడదు! ఏమిటీ న్యాయం?' అన్నాడు గుణసాగర్. అతనంత ఆవేశంగా అంతకు ముందెప్పుడూ మాట్లాడలేదు. ముఖ్యంగా దర్బారులో అతనెప్పుడూ మాట్లాడేవాడు కాదు. మంత్రికి ఇక ఏమి చెప్పడానికీ తోచలేదు. అతను మహారాజు వైపు చూశాడు.

'ధీరేంద్రా! గుణసాగర్ సంకల్పాన్ని మార్చడానికి ప్రయత్నించ వద్దు. జితేంద్రుని వెదకడానికి వెళ్ళిన పరిశోధకులెవ్వరూ తృప్తికరమైన వార్త నింతవరకు చెప్పలేకపోయారు. ఇక వాళ్ళు సాధించ గలిగిందేమీ లేదని తెలుస్తూనే ఉంది. అలాంటప్పుడు గుణసాగరే అందుకు పూనుకుంటే, మనం అభ్యంతరపరచవలసిన అవసరం నాకేమీ కనబడలేదు. అతని ప్రయాణానికి కావలసిన ఏర్పాట్లు చేయండి,' అన్నాడు మహారాజు.

'మహారాజా! మన్నించండి. ఇది యుక్తితో సాధించవలసిన పని; కాని, శక్తితో కొనసాగేది కాదు. ప్రతాపసింహుడు మహా బలవంతుడు. అతన్నెదిరించి మనం జయించలేము.'

'మంత్రివర్యా! జయాపజయాలను నిర్ణయించే వాళ్ళం మనం కాము. శత్రువు బలాన్ని చూసి భయపడ్డం పొరపాటు. మీరిక ఏమీ అభ్యంతరం చెప్పకండి.'

'రాజకుమారా! జితేంద్రుడు తప్పకుండా తప్పించుకు వస్తాడు. అతని తెలివి మీకు తెలియంది కాదు—'

'—అనే అతని కర్మకు అతన్ని విడిచిపెట్టి ఇన్ని రోజులూ చూస్తూ ఊరుకున్నారు.'

'ధీరేంద్రా! గుణసాగర్ మాటకు అడ్డు చెప్పకండి,' అన్నాడు మహారాజు.

అదే సమయంలో దర్బారులోకి వచ్చిన జితేంద్రుడు తొందరగా మహారాజును సమీపించి పాదాలు తాకి నమస్కరించాడు. తర్వాత తండ్రికి నమస్కరించి, గుణసాగర్ ప్రక్కన వెళ్ళి కూర్చున్నాడు.

జితేంద్రుని రాక దర్బారులో ఉన్న వాళ్ళనందరినీ సంతోషపరచింది. అతను రావడంతోనే వాదోపవాదాలు అంతరించాయి. మహారాజు విచారం తొలగిపోయింది. మంత్రి ప్రశాంతంగా ఊపిరి పీల్చాడు. గుణసాగర్ ముఖంలో ఉండే గాంభీర్యం అంతరించి, ఆ స్థానంలో ఆనందం అలుముకుంది.

అందరూ సంతోషంగా జితేంద్రుణ్ణే చూస్తున్నారు. అంతలో జితేంద్రుని వెనుకనే వచ్చిన బలభద్ర దేవుడు మహారాజుకు నమస్కరించాడు. 'మహారాజా! కీర్తిసేన మహారాజు తమకీ కానుకలు పంపించారు,' అని అమూల్యమైన కానుకలెన్నో మహారాజుకు అందజేశాడు. తర్వాత గుణసాగర్‌ని సమీపించి అతనికోసం ప్రత్యేకించి తెచ్చిన విలువైన దుస్తులను అతని శరీరం మీద కప్పాడు.

మహారాజు కీర్తిసేనుడు పంపిన కానుకలు చూసి గజపతి మహారాజు చాలా సంతోషించాడు.

ధీరేంద్రుడు గౌరవంగా బలభద్ర దేవుని తన ఆసనం ప్రక్కన కూర్చుండబెట్టుకున్నాడు.

మహారాజు తృప్తిగా దర్బారంతా ఒక్కసారి పరికించి చూశాడు. దర్బారులో ఉన్న వాళ్ళంతా జితేంద్రుని వృత్తాంతం తెలుసుకోడానికి కుతూహలపడుతున్నారని తెలుసుకున్నాడు. మహారాజుకు కూడా ఆ విషయం తెలుసుకోవాలని ఆత్రుతగానే ఉంది. 'జితేంద్రా! నిన్నెవరు బంధించారు? ఎలా బంధించారు? ఇప్పటి వరకు ఎక్కడ ఉన్నావు?' అన్నాడు.

జితేంద్రుడు వీరగడం విడిచిపెట్టింది మొదలు అప్పటి వరకూ జరిగిన విషయమంతా వివరంగా చెప్పాడు.

మహారాజు ఆనందానికి అంతు లేకపోయింది. 'జితేంద్రా! నీ శక్తి, యుక్తులను శత్రువుకు బాగా ఎరుకపరచావు. చాలా సంతోషం. నీ రాకకోసం అందరూ తపించిపోతున్నారు. వెంటనే మహలుకు వెళ్ళి అందరికీ కనుపించు,' అన్నాడు.

జితేంద్రుడు మహారాజుకు నమస్కరించి దర్బారులోంచి వెళ్ళిపోయాడు. తర్వాత మహారాజు బలభద్ర దేవుని ఎన్నో ప్రశ్నలు వేసి, కీర్తిసేనుని యోగక్షేమాలు తెలుసుకుని దర్బారు ముగించాడు.

ధీరేంద్రుడు బలభద్ర దేవుని స్వయంగా తన ఇంటికి తీసుకు వెళ్ళి తగిన విధంగా గౌరవించాడు.

జితేంద్రుడు అందరినీ కలుసుకున్న తర్వాత రాజకుమారుడు గుణసాగర్ భవనంలో ప్రవేశించాడు.

గుణసాగర్ జితేంద్రుడ్ని చూడగానే ఆనందంగా కౌగలించుకుని కూర్చుండబెట్టాడు. 'జితేంద్రా! నిన్ను విడిపించిన

ఆ దేవతెవరు? ఆమె అంత బాగా పాడుతుందా?' అన్నా డతను కూడా జితేంద్రుని కెదురుగా కూర్చుంటూ.

'సాగర్! దేవతంటే నిజంగా దేవత కాదు; నా ప్రేమ దేవత సుమతి! ఆమే నన్ను చెరలోంచి తప్పించింది.'

'ఏమిటీ? సుమతా? ఎంత ఆశ్చర్యంగా ఉంది! ఏమైనా మీరు స్వేచ్ఛాజీవులు, నిర్మల ప్రేమికులు, ప్రణయమూర్తులు. మీ కలయికకు అభ్యంతరాలుండవు. కోరినపుడు కలుసుకుంటారు; తనివితీరా మాట్లాడుకుంటారు. నాకే ఆ అదృష్టం లేకపోయింది. జితేంద్రా! నీతో ఏమని చెప్పను? ఎన్నిసార్లు చెప్పను? వియోగాన్ని సహించలేకపోతున్నాను. ఈ ఎడబాటు ఎంత కాలమో తెలియకుండా ఉంది!'

'సాగర్! అనుకూల పరిస్థితులేర్పడుతున్నాయి. నీ విచారం తొలగిపోయే రోజు వస్తూంది. ఇక దిగులు పడవలసిన అవసరం లేదు,' అన్నాడు జితేంద్రుడు. తర్వాత అతను అక్కడనుండి బయలుదేరి తిన్నగా ఇంటికి చేరుకున్నాడు.

మూడవ రోజున బలభద్ర దేవుడు గజపతి మహారాజు దర్బారుకు వెళ్లాడు. మహారాజుకు నమస్కరించి 'మహారాజా! ఈ రోజునే మా దేశం వెడుతున్నాను. తమ అనుమతి కోసం వచ్చాను. దయ ఉంచండి,' అన్నాడు.

మహారాజు మరి కొన్ని రోజులు ఉండి వెళ్ళమన్నాడు.

'మహారాజా! క్షమించండి. ఇప్పటికే ఆలస్యమైంది. అక్కడ శత్రువులు ఎలాంటి కుతంత్రాలు పన్నుతున్నారో, ఎట్లాంటి అలజడి లేవదీస్తున్నారో అనే ఆందోళన నన్ను పీడిస్తూంది. తొందరగా సుందరగడం చేరాలనే ఆరాటం చాలా ఎక్కువగా ఉంది. మహారాజా! తమ అంగీకారాన్ని తీసుకుని జితేంద్రుడ్ని మళ్ళీ నా వెంట తీసుకు రమ్మని మా మహారాజు ఆజ్ఞాపించారు. తమ సెలవైతే...'

'తప్పకుండా తీసుకు వెళ్ళండి,' అన్నాడు మహారాజు.

ఆ సమయంలో జితేంద్రుడు దర్బారులోనే ఉన్నాడు. మహారాజు ఆజ్ఞ కాగానే అతను బలభద్ర దేవుని ప్రక్కకు వచ్చి నిలబడ్డాడు.

ఆ రోజునే జితేంద్రుడు బలభద్ర దేవునితో కలిసి సుందర గడం బయలుదేరాడు.

## 26

సాయంకాలానికి సుందరగడం చేరుకున్న జితేంద్ర, బలభద్ర దేవులు ఆ రోజుకు విశ్రాంతి తీసుకొని మరుచటి రోజున దర్బారుకు హాజరయ్యారు. ఇద్దరూ మహారాజు కీర్తిసేనునకు నమస్కరించి తమ తమ స్థానాల్లో కూర్చున్నారు.

బలభద్ర దేవుడు మహారాజుతో వీరగడం విశేషాలు విపులంగా చెప్పి సంతోషపరచాడు. జితేంద్రుడు కూడా తన మాటలతో మహారాజును తృప్తి పరచాడు.

అంతలో ప్రచండ దుర్గం గూఢచారి సద్గుణ తంత్రవేత్త దర్బారులో ప్రవేశించాడు. మహారాజుకు నమస్కరించి నిలబడ్డాడు. మంత్రి అడిగిన ప్రశ్నలకు సమాధానంగా 'నేను ప్రచండ దుర్గం గూఢచారిని. నన్ను సద్గుణ తంత్రవేత్త అంటారు,' అన్నాడు.

ఆ పేరు వినగానే మహారాజు కోపంతో కంపించి పోయాడు. సద్గుణ తంత్రవేత్తే తనను బంధించాడని జితేంద్రుడు చెప్పిన మాటలు మహారాజింకా మరచిపోలేదు. అతను సైనికులను చూసి 'ఇతన్ని పట్టుకొని స్తంభానికి విరిచి కట్టండి,' అన్నాడు.

సైనికులు అతన్ని చుట్టుముట్టారు.

వెంటనే జితేంద్రుడు లేచి నిలబడ్డాడు. 'మహారాజా! మన్నించండి. మీ ఆగ్రహానికి కారణం నాకు తెలుసు. అయినా, అతన్ని మీరు ఈ సమయంలో బంధించడం ధర్మం కాదు. ఇది గూఢచారి నియమాలకు విరుద్ధం. గూఢచారులను నేరం చేస్తున్న సమయాల్లో బంధించి శిక్షించడం న్యాయం. అంతే కాని, బహిరంగంగా వచ్చినపుడు వారినేమీ చేయ కూడదు. ధర్మాన్ని దృష్టిలో పెట్టుకుని అతన్ని విడిచిపెట్టండి. అతను వచ్చిన పని తెలుసుకోండి,' అన్నాడు వినయంగా.

మహారాజు కోపాన్ని తగ్గించుకున్నాడు. సైనికులకు సౌంజ్ఞ చేసి తొలగించాడు. 'తంత్రవేత్తా! నువ్వు జితేం ద్రుడ్ని బంధించి మాకు కలిగించిన బాధకు నిన్ను స్తంభానికి కట్టించి, కొరడాలతో కొట్టించాలనుకున్నాను. నీ అదృష్టం బాగుంది. జితేంద్రుడే నిన్నిపుడు కాపాడాడు. సరే! నువ్విపు డెందుకు వచ్చావు?' అన్నాడు.

'మహారాజా! జితేంద్రుని సద్భావానికి నా కృతజ్ఞతను తెలియజేయకుండా ఉండలేకపోతున్నాను. ఇక నేను వచ్చిన పని వినండి. మా మహారాజు తమకీ లేఖ నందచేయమన్నారు,' అంటూ సద్గుణ తంత్రవేత్త ఒక ఉత్తరాన్ని మహారాజుకు ఇచ్చాడు.

మహారాజు ఆ ఉత్తరం బలభద్ర దేవునికిచ్చి చదవ మన్నాడు. బలభద్ర దేవుడు ఉత్తరం విప్పాడు. మహారాజు, జితేంద్రుడు మంత్రి ముఖంలోకి చూస్తున్నారు.

ఉత్తరం చూసిన బలభద్ర దేవుని ముఖ కవళికలు మారాయి. అతను ఉత్తరం అంతా తనలోనే చదువుకుంటు న్నాడు. మాటి మాటికీ అతని ముఖంలో మార్పులు కనిపిస్తు న్నాయి.

మంత్రిలో కలుగుతున్న మార్పులు చూసి మహారాజుతో పాటు జితేంద్రుడు కూడా విషయం గ్రహించాడు. ఆ ఉత్తరంలో ఆవేశాన్ని కలిగించే మాటలేవో ఉన్నాయని తెలుసుకున్నాడు. అతనొకసారి సద్గుణ తంత్రవేత్త వైపు చూశాడు. ఆ చూపులో 'ఏమిటీ విషయం?' అన్న ప్రశ్న ద్యోతకమౌతూంది.

సద్గుణ తంత్రవేత్త జితేంద్రుని చూపులోని భావాన్ని తేలిగ్గా గ్రహించాడు. 'విషయం చాలా గంభీరమైందే!' అని కళ్ళతోనే సమాధానం చెప్పాడు.

అంతలో బలభద్ర దేవుడు ఉత్తరాన్ని మడిచి జాగ్రత్త పరచి 'మహారాజా! ఇది దర్బారులో విశదపరచవలసిన విషయం కాదు; తర్వాత మనవి చేస్తాను,' అన్నాడు.

మహారాజు కాసేపు ఆలోచించాడు. 'దర్బారు ముగియగానే నా ఆలోచనా మందిరానికి రండి. మీ వెంట జితేంద్రుడు కూడా వస్తాడు. ఈ గూఢచారికి తగిన వసతి సౌకర్యాలు కలిగించండి,' అన్నాడు.

దర్బారు ముగిసిన వెంటనే బలభద్ర దేవుడు, జితేంద్రుడు మహారాజు ఆలోచనా మందిరంలో ప్రవేశించారు. వారి రాక కోసం ఎదురు చూస్తున్న మహారాజు మంత్రిని చూసి 'ఉత్తరంలో ఏమని వ్రాసి ఉంది?' అన్నాడు.

'మహారాజా! మీరే స్వయంగా చదివి చూడండి. అదే మంచిది,' అన్నాడు బలభద్ర దేవుడు.

మహారాజు మంత్రి ఇచ్చిన ఉత్తరం విప్పి చూశాడు. ఆ ఉత్తరం పూర్తిగా చదివేసరికి మహారాజు ముఖం జేవురించింది. కళ్ళు నిప్పుకణాలయ్యాయి. క్రోధం వల్ల పెదాలు కంపించసాగాయి. అతనా ఉత్తరాన్ని విసరేసి 'ఆ గూఢ

చారిని తక్షణం దేశం విడచి పొమ్మనండి. ఈ ఉత్తరానికి మన సమాధానం అదే!' అన్నాడు.

తర్వాత మహారాజు చాలా సేపటి వరకూ ఆలోచిస్తూ ఉండిపోయాడు. ఉత్తరంలో ఉన్న విషయాన్ని జితేంద్రుడు కూడా మంత్రి వల్ల ముందే తెలుసుకున్నాడు. అతని శరీరం క్రోధంతో ఉడుకెత్తి పోతూంది. అయినా అతను ఆ విషయాన్ని పైకి వ్యక్తం కానీయకుండా మహారాజు అభిప్రాయం కోసం ఎదురు చూడసాగాడు.

కాసేపటికి మహారాజు మౌనం తొలగింది. 'దుర్ముఖి ప్రచండ దుర్గం చేరడంతోనే ఇలా జరుగుతుందని ఊహించాను. దుర్ముఖి దుర్బోధవల్లే ప్రతాపసింహుడు ఈ ఉత్తరం వ్రాశాడు. ఉత్తరానికి మనం తృప్తికరమైన సమాధానం ఇవ్వమని దుర్ముఖికి తెలుసు. అందుకే అతను ఈ ఎత్తు ఎత్తాడు. మన జవాబు ప్రతాపసింహునికి క్రోధాన్ని, ఈర్ష్యను కలిగిస్తుందని దుర్ముఖి ఆలోచించాడు. నిజం కూడా అంతే! నా కంఠంలో ప్రాణం ఉండగా ప్రతాపసింహుని కోరిక నెరవేరదు. అతని ఉద్దేశానికి వ్యతిరేకంగా మనం సమాధానం ఇవ్వడంతో తప్పకుండా ప్రతాపసింహుడు మన మీద పగ పడతాడు. ఆ అవకాశాన్ని దుర్ముఖి విడిచి పెట్టడు. వెంటనే ప్రతాపసింహుణ్ని మన దేశం మీదకు యుద్ధానికి తీసుకు వస్తాడు. తర్వాత ఏమి జరుగుతుందో నాకు తెలుసు. ఏది ఎలా జరిగినా నా శరీరంలో కొన ఊపిరి ఉన్నంత వరకు అతని ఉద్దేశం ఫలించదు. వెంటనే మన సేనల నన్నింటినీ సమకూర్చండి. యుద్ధానికి సిద్ధంగా తయారు చేయండి,' అన్నాడు.

'మహారాజా! మీరు అన్న మాటలో ఏమీ సందేహం లేదు. ప్రతాపసింహుడు సైన్య సమేతంగా వచ్చి తప్పకుండా

మన దేశంమీద విరుచుకు పడతాడు. అతని గూఢచారులు ఇక్కడకు రావడంతోనే ఆ విషయం గ్రహించాను. ప్రతాప సింహుడు మొదట తన గూఢచారులను పంపి, వాళ్ళ చమత్కార చాతుర్యాలతో కార్యాన్ని సాధించాలనుకున్నాడు. కాని, అలా జరగలేదు. అతని ఆరుగురు గూఢచారుల్లోనూ అయిదుగురు మన చేతుల్లో చిక్కుకున్నారు. ఇక సద్గుణ తంత్రవేత్త ఒక్కడే మిగిలిపోయాడు. అతనొక్కడివల్లా తన కోరిక నెరవేరదని తలంచాడు మహారాజు. అందుల్లే అతను స్వయంగా ఉత్తరం వ్రాశాడు. మన సమాధానం విన్న వెంటనే దుర్ముఖి మహారాజును ఉద్రేక పరచి యుద్ధానికి పురి కొల్పుతాడు. ప్రతాపసింహుడు తన అసంఖ్యాకమైన సేనా సముదాయంతో మన మీదకు వస్తాడు. అందుకు తగినట్టుగా మనం కూడా అన్ని విధాలా తయారుగా ఉండాలి,' అన్నాడు జితేంద్రుడు.

'ఔను. ఆ విషయంలో మీరు తగిన జాగ్రత్తలో ఉండండి. ప్రతాపసింహుని దగ్గర యాభై వేల సైన్యం ఉంది. మన దగ్గర కేవలం పదిహేను వేల సైన్యం మాత్రమే ఉంది. అతని దగ్గర రెండు వందల ఫిరంగులున్నాయి. మన దగ్గర యాభై ఫిరంగులే ఉన్నాయి. శత్రువు మనకంటే చాలా బలవంతుడే! అయితే, అతనికి మనం భయపడి దాసోహం చేయవలసిన అవసరం లేదు. అతనికి మనం దాసులమై, వ్యక్తిత్వాన్ని నాశనం చేసుకోనక్కర లేదు. నా బొందెలో జీవం ఉన్నంత వరకూ అతని అభిప్రాయం కొనసాగనివ్వను. అతన్ని సుందరగడం గడ్డ మీద కాలు మోపనీయను.'

'ఇక్కడున్న పదిహేను వేల సైన్యంతోనూ వీరగడం సైనికులు పదివేల మందీ కలిస్తే మొత్తం సైన్యం పాతిక వేలు

అవుతుంది. ప్రతాపసింహుని సైన్యాన్ని తరిమి కొట్టడానికి ఆ మాత్రం సేన సరిపోతుంది. మీరు వెంటనే గజపతి మహారాజు పేర నొక ఉత్తరం వ్రాసి, బలభద్ర దేవులను వీరగడం పంపించండి. నేను కూడా ఆయనతో ఉంటాను. మహారాజును ఒప్పించి, అక్కడున్న సైన్యాన్నంతనూ ఇక్కడకు తీసుకు వస్తాను. అంతే కాదు, మీరు అంగీకరిస్తే రాజకుమారుడు గుణసాగర్‌ని కూడా వెంటబెట్టుకు వస్తాను. సైన్యాధిపత్యాన్ని అతనికి అప్పగిస్తే, ప్రతాపసింహుడు మైదానం విడిచి పారిపోతాడు.'

బలభద్ర దేవుడు జితేంద్రుని ఉద్దేశాన్ని గట్టిగా బలపరుస్తూ 'మహారాజా! ఆలోచించకండి. గుణసాగర్ శక్తి సమర్థతలు మీకు తెలియనివి కావు. అతను ఆధిపత్యం వహిస్తే, పది వేల సైన్యం ఉంటే చాలు-ప్రతాపసింహుని సేనను సర్వనాశనం చేస్తుంది. గుణసాగర్ పన్నిన యుద్ధవ్యూహం భేదించడానికే అలవి కాకుండా ఉంటుంది,' అన్నాడు.

'నిజమే! అందులో అతిశయోక్తి ఏమీ లేదు. అతను మహావీరుడు, గొప్ప ధైర్యవంతుడు. యుద్ధ విద్యలో పరిపూర్ణ జ్ఞానాన్ని అలవరచుకున్నాడు. అతని నాయకత్వంలో నడచిన సైన్యం ఎప్పుడూ పరాజయం పొందదు. ఆ విషయం నాకూ తెలుసు. కాని, అతన్ని అంత చిన్న వయస్సులో యుద్ధరంగానికి పంపడం నా అభిమతం కాదు. నేను బ్రతికుండగా అతను యుద్ధం చేయవలసిన అవసరం లేదు. ఎవరి సంతతైనా ఒకటే! గుణసాగర్ వీరగడంలో జన్మించినా, సుందరగడంలో పెరిగాడు; నా కళ్ళ ముందు అతను ఆడుకున్నాడు; నా చేతుల్లో పెద్దవాడయ్యాడు. అతను యుద్ధం చేయడానికి నేనంగీకరించను. నేనంగీకరించినా కన్నతండ్రి గజపతి మహారాజు అందుకు ఒప్పుకోడు.'

'మహారాజా! మన్నించండి. మీ అభిప్రాయం సరైంది కాదని మనవి చేస్తున్నాను. మీరు యుద్ధం చేస్తామంటే గుణ సాగర్ మహల్లో కూర్చుని విశ్రాంతి తీసుకుంటాడనుకోకండి. మీయందు అతనికున్న భక్తి అపారం. అతను మిమ్మల్ని ఎంతో గౌరవిస్తాడు. అతను వీరగడం వెళ్ళిపోయినంత మాత్రంచేత మిమ్మల్ని మరచిపోయాడనుకోకూడదు. అతనెల్లప్పుడూ మీ యోగక్షేమాలను తెలుసుకుంటూనే ఉన్నాడు. మీ మంచినే ఎప్పుడూ కాంక్షిస్తున్నాడు. మీ కోసం ఏమి చేయడానికైనా సిద్ధంగా ఉన్నాడు. ప్రతాపసింహుడు సుందరగడం పైదకు యుద్ధానికి వచ్చాడని తెలియడంతో అతనిక్కడకు వచ్చి వ్రాలతాడు. మీరు కోరకపోయినా కత్తిపట్టి కదనరంగం లోకి ఉరుకుతాడు. వీరవిహారం చేసి శత్రువును ఓడిస్తాడు. సుందరగడం స్వతంత్రాన్ని నిలుపుతాడు. ఇక గజపతి మహా రాజుయొక్క వీరత్వాన్ని శంకించేవారే లేరు. వీరులైనవారికి పౌరుష పరాక్రమాలే ప్రధానం కాని, ప్రేమాభిమానాలు ముఖ్యంగా చూడరు. గుణసాగర్ యుద్ధానికి సిద్ధపడితే, గజపతి మహారాజు ఎన్నడూ రాజకుమారుడ్ని వారించరు; మీదు మిక్కిలి ఆయన కూడా స్వయంగా కత్తిపట్టి యుద్ధం చేస్తారు. మీ ఇరువురి స్నేహాభిమానాలు కొనియాడతగినవని మా తండ్రి చెప్పగా విన్నాను. అన్యాయంగా శత్రువు స్నేహితుని మీద విరుచుకుపడుతుంటే చూస్తూ ఎవరు ఊరు కుంటారు? ప్రతాపసింహుడు మీ పైన కత్తి ఎత్తితే గజపతి మహారాజు సహించగలరా? మహారాజా! మీరు మరోకలా భావించకండి. నాతో బలభద్ర దేవులను పంపండి,' అన్నాడు జితేంద్రుడు.

జితేంద్రుని మాటలు విని మహారాజు చాలా సంతో షించాడు. తను స్వయంగా గజపతి మహారాజుకు ఉత్తరం

వ్రాసి బలభద్ర దేవునికి ఇచ్చాడు. 'మీరు వెంటనే బయలుదేరి వీరగడం వెళ్ళండి. ప్రతాపసింహుడు మన మీదకు దండెత్తి వస్తున్నట్లు కూడా చెప్పి, ఈ సందర్భంలో గజపతి మహారాజు ఉద్దేశమేమిటో తెలుసుకోండి. ఈ ఉత్తరం మీరే స్వయంగా మహారాజుకు అందజేయండి. జితేంద్రుడు మీకు తోడుగా ఉంటాడు. ఉత్తరానికి సమాధానం తీసుకొని రేపే తిరిగి రండి. ఆలస్యం జరగకూడదు,' అని జితేంద్రుడ్ని చూస్తూ 'జితేంద్రా! కార్యం తృప్తికరంగా సాధించుకు రావాలి. మహారాజుకు ఇక్కడి పరిస్థితులన్నీ వివరంగా తెలియచెయ్యి. వెంటనే బయలుదేరండి,' అన్నాడు మహారాజు కీర్తిసేనుడు.

జితేంద్రుడు, బలభద్ర దేవుడు మహారాజు దగ్గర సెలవు తీసుకుని వీరగడం వైపు ప్రయాణం సాగించారు.

## 27

సూర్యాస్తమయం కాక ముందే ఇద్దరూ వీరగడంలో ప్రవేశించి, మంత్రి ధీరేంద్రుని ఇంటికి వెళ్ళారు.

ధీరేంద్రుడు జితేంద్రుడ్ని ప్రేమతో కుశల ప్రశ్నలు వేసి, బలభద్ర దేవుని గౌరవించి సత్కరించాడు.

బలభద్ర దేవుడు జితేంద్రునితో అన్ని విషయాలూ చెప్పి, మహారాజు ప్రతాపసింహుడు కీర్తిసేనునికి పంపిన ఉత్తరాన్ని గురించి కూడా తెలియ పరచాడు.

ధీరేంద్రుడు పళ్ళు పటపట కొరుకుతూ 'ప్రతాపసింహుడు అంత పెద్దవాడయ్యాడా! సైనిక బలం, ఫిరంగి బలం అతనికి సహాయ పడతాయనుకున్నాడా? దుర్ముఖి అతనికి శనిలా దాపురించాడు. ప్రతాప సింహుని పొగరు అణచడం పెద్ద పని కాదు. మీరు నిశ్చితంగా ఉండండి. ఆందోళన పడవలసిన

అవసరం ఏమీ లేదు. సాయంకాలం మహారాజును కలుసుకుందాము. అప్పుడు అన్ని విషయాలూ తేలతాయి,' అన్నాడు.

సాయంకాలమైంది.

బలభద్ర దేవుడు ధీరేంద్రునితో కలిసి మహారాజు భవనానికి వెళ్ళాడు. గుణసాగర్ కూడా ఆ సమయానికి అక్కడే ఉన్నాడు.

మహారాజు ఇద్దరు మంత్రులను చూడగానే ఆహ్వానించి, కూర్చోమని సౌజ్ఞ చేశాడు. తర్వాత బలభద్ర దేవుడ్ని చూసి 'మీరు నిన్ననే కదా-వెళ్ళారు? ఇంత తొందరగా రావడంలో ఏదో విశేషం ఉందనుకుంటున్నాను. విషయమేమిటో వెంటనే చెప్పండి,' అన్నాడు. బలభద్ర దేవుడు ఏమీ మాట్లాడకుండా మహారాజు కీర్తిసేనుడు వ్రాసిన ఉత్తరాన్ని గజపతి మహారాజు చేతికి అందిచ్చాడు. మహారాజు ఆ ఉత్తరం చదువుకుని కోపంతో కంపించిపోయాడు. క్రోధం వల్ల అతనేమీ మాట్లాడలేక ఆ ఉత్తరాన్ని గుణసాగర్‌కిచ్చాడు.

ఆ ఉత్తరం పూర్తిగా చదివేటప్పటికి మహారాజుకు కలిగిన స్థితే గుణసాగర్‌కి కూడా కలిగింది. అతను ఆవేశంతో లేచి నిలబడ్డాడు. అతనికి కళ్ళు ఎర్రబడ్డాయి. ఛాతీ ఎగిరి పడుతూంది. ఒక్క చోట స్థిరంగా నిలబడలేక పోతున్నాడు. అతను మహారాజు ముందుకు వచ్చి నిలబడ్డాడు. 'యుద్ధం చేయాలని ఎంతో కాలంనుంచి కుతూహలంగా ఉంది. అక్రమంగా పరుల మీద దండెత్తడం ధర్మ విరుద్ధమని ఇంత వరకూ నాకున్న కోర్కెను నాలోనే ఇముడ్చుకున్నాను. ఇప్పుడు నాకు మంచి సమయం లభించింది. అన్యాయానికి తలపడిన ఆ ప్రతాప సింహుడ్ని బంధించి తీసుకు వచ్చి మీ పాదాల ముంగు పడేస్తాను. ఇలాంటి అవకాశం మరొకప్పుడు లభించక పోవచ్చు. నాకు అనుమతి నివ్వండి.

సుందరగడం హద్దుల్లోకి చేరక ముందే ప్రతాప సింహుడ్ని బంధిస్తాను. అతని అహంభావాన్ని అణచి వేస్తాను,' అన్నాడు గంభీరంగా.

బలభద్ర దేవుడు గుణసాగర్ మాటలు విని లోలోపల చాలా సంతోషించాడు. ధీరేంద్రుడు కూడా ఆనందించాడు.

మహారాజు కాసేపు మౌనంగా ఉండి తర్వాత గుణసాగర్ ముఖంలోకి చూస్తూ 'సాగర్! నీ మాటలు నాకు చాలా ఆనందాన్ని కలిగించాయి. అయితే ముందే ప్రతాపసింహునితో తలపడ్డం మంచిది కాదు. నువ్వు సైన్యాన్ని వెంటబెట్టుకొని సుందరగడం వెళ్ళు. ప్రతాపసింహుడు తప్పకుండా సుందర గడాన్ని ఆక్రమించాలని వస్తాడు. అప్పుడు నీ ప్రతాపాన్ని చూపించు. సుందరగడం గౌరవాన్ని కాపాడు. మహారాజు కీర్తిసేనునికి అండగా ఉండి, ఆయనకు ఏ ఆపదా రాకుండా చూడు. క్షత్రియులకు యుద్ధంకంటె ప్రియమైంది ఇంకేముంది? మన సైన్యాన్నంతా కీర్తిసేనుని సహాయం కోసం తీసుకు వెళ్ళు. వీరగడం మర్యాదను నిలబెట్టు,' అన్నాడు.

మంత్రులిద్దరూ తృప్తిగాను, ఉత్సాహంగాను ఒకరి ముఖం లోకి ఒకరు చూసుకున్నారు.

మహారాజు ధీరేంద్రుని వైపు చూశాడు. 'తెల్లవారేటప్ప టికి మన సైన్యమంతా ప్రయాణానికి సిద్ధంగా ఉండాలి. అందుకు తగిన ఏర్పాట్లు చేయండి. సైనికోద్యోగులనందరినీ ఈ రాత్రే సమావేశపరచండి. సూర్యోదయం అవుతూండగా గుణసాగర్ నాయకత్వంలో మన సైన్యం సుందరగడం వైపు బయలుదేరాలి,' అన్నాడు.

'మహారాజా! యుద్ధావసర వస్తువులన్నీ సిద్ధంగానే ఉన్నాయి. కేవలం సైనికులకు సూచన చేయడమే తరువాయి.

ఇప్పుడే ఆ లోటు కూడా తొలగిస్తాను,' అన్నాడు వీరేంద్రుడు.

తర్వాత మహారాజు బలభద్ర దేవుడ్ని చూసి ఇలా అన్నాడు: 'మీరు ఉదయం వరకూ విశ్రాంతి తీసుకోండి. సూర్యోదయం కాగానే సైన్య సమేతంగా గుణసాగర్‌ని మీతో తీసుకు వెళ్ళండి,' అన్నాడు.

## 23

తెల్లవారింది. సూర్యోదయమౌతూండగా గుణసాగర్ వీరోచితమైన దుస్తులు ధరించి, తల్లిదండ్రులకు నమస్కరించి, వారి ఆశీర్వచనాలు పొంది, ప్రజానీకం ఉత్సాహంగా జయ జయధ్వనులు చేస్తూండగా పారశీక గుఱ్ఱం రాజహంస (గుఱ్ఱం పేరు) మీద కూర్చుని సుందరగడం వైపు బయలుదేరాడు. జితేంద్ర, బలభద్ర దేవులు అతనికి రెండు వైపులా ఉన్నారు. పది వేల వీర సైనికులు వారి వెనుక నడుస్తున్నారు.

సుందరగడం సమీపించగానే గుణసాగర్ గుఱ్ఱంమీంచి దిగి బలభద్ర దేవుడ్ని చూశాడు. 'మంత్రివర్యా! ఈ విశాల ప్రదేశంలో గుడారాలు వేయించి సైన్యానికి కావలసిన సదుపాయాలు కలిగించాక పట్టణంలోకి వస్తాను,' అన్నాడు.

'అలాగే చేయండి. నేను ఈ లోపున మహారాజును దర్శించి మీరు వస్తున్న సమాచారం అందజేస్తాను. తర్వాత నేను స్వయంగా వచ్చి మిమ్మల్ని తీసుకు వెడతాను,' అన్నాడు బలభద్ర దేవుడు.

'మంచిది. వెళ్ళి రండి,' అన్నాడు గుణసాగర్.

బలభద్ర దేవుడు వెంటనే సుందరగడం చేరుకొని మహారాజు భవనానికి వెళ్ళాడు. వీరగడంలో జరిగిన విషయం అంతా చెప్పి 'మహారాజా! గుణసాగర్ సర్వ సైన్య సమే

తంగా వచ్చి మన పట్టణానికి క్రోసు దూరంలో మకాం చేశారు,' అన్నాడు.

మహారాజు కీర్తిసేనుడు ఆ మాట విని చాలా సంతోషించాడు. 'సైనికులుండడానికి ఆ ప్రదేశం చాలా అనుకూలంగా ఉంటుంది. కాని, గుణసాగర్‌ని మన భవనానికి తీసుకు రావాలి. మీరు మన సరదారులను తీసుకు వెళ్ళి, గుణసాగర్‌ని సైనిక మర్యాదలతో ఆహ్వానించండి,' అన్నాడు.

బలభద్ర దేవుడు సర్దారులతో కలిసి బయలుదేరి గుణసాగర్‌ని సమీపించి మహారాజు ఆజ్ఞను తెలియపరచాడు.

గుణసాగర్ బలభద్ర దేవునితో సుందరగడం వైపు బయలుదేరాడు. అంతలో జితేంద్రుడు నూరుగురు యుద్ధ సైనికులను సమాయత్తపరచి గుణసాగర్‌ని అనుసరించాడు.

మహారాజుకు సహాయంగా గుణసాగర్ సేనా సమేతంగా సుందరగడం వస్తున్నాడని పట్టణమంతా వ్యాపించింది. కోటలో ప్రవేశిస్తున్న రాజకుమారుడ్ని చూడ్డానికి ప్రజలందరూ ఉర్రూతలూగిపోతున్నారు. వీధులన్నీ ప్రజలతో నిండిపోయాయి. ఆడవాళ్ళు, మగవాళ్ళు ఎత్తైన ప్రదేశాల్ల మీద, భవనాల్లోనూ నిలబడి రాజకుమారుని రాకకోసం ఎదురు చూస్తున్నారు.

గుణసాగర్ పట్టణంలో ప్రవేశిస్తున్నాడన్న కబురు మహారాజుకు చేరింది. ఆ వార్త చేరగానే మహారాజు మహల్లోకి వెళ్ళి మహారాణి మణిగర్భతో ఆ విషయం చెప్పాడు. ఆమె మహానందంతో లెక్కకు మించిన స్త్రీ సముదాయంతో వచ్చి ఎత్తైన గోపురం మీదకు ఎక్కి కూర్చుంది.

రాజకుమారి రాగమణి, సుమతి, రేవతి కూడా మహారాణితోనే ఉన్నారు. ఆ ముగ్గురి సంతోషం చెప్పడానికి అలవి కాకుండా ఉంది.

రాజ వీధిలో దూరంగా ధూళి లేచింది. ప్రజా సమూహంలో అలజడి లేచింది. మహారాణి కుతూహలంతో లేచి నిలబడింది. రాగమణి అవస్థ ఇక చెప్పనక్కర లేదు!

గుఱ్ఱాల డెక్కల ధ్వని లయ తప్పకుండా వినబడుతూంది. కాసేపటిలో సైనికులు ముందుకు వస్తున్నారు. వారెక్కిన గుఱ్ఱాలు దర్పంగా అడుగులు వేస్తూ 'టక-టక' శబ్దం చేస్తున్నాయి.

గుణసాగర్ అందరికంటె ముందు వస్తున్నాడు. అతనికి రెండు వైపుల జితేంద్రుడు, బలభద్ర దేవుడు ఉన్నారు.

సర్వాలంకారాలతోను నిండి ఉన్న గుణసాగర్ గుఱ్ఱం రాజహంస అతి తీవ్రిగా పరుగెడుతూంది. సర్వ సైన్యాధిపతి దుస్తులను ధరించిన గుణసాగర్‌ని చూడగానే అతని బలం, ధైర్యం, వీరత్వం, పరాక్రమం ప్రస్ఫుటంగా కనబడుతున్నాయి.

రాజకుమారుని చూసిన వాళ్ళందరూ సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోతున్నారు. మహారాణి దృష్టి కూడా గుణసాగర్ మీద పడింది. చిరకాలానికి కనిపించిన గుణసాగర్ మీద ఆమెకు అపరిమితమైన వాత్సల్యం అలుముకుంది. రాగమణికి అతనే భర్త కావాలని మనస్సులోనే ఆమె దేవుని ప్రార్థించింది.

రాగమణి, సుమతి, రేవతి-మహారాణికి కొంచెం దూరంగా కూర్చున్నారు. రాగమణి గుణసాగర్‌ని చూసి ఆనందంతో రెప్పలు టప టపలాడించింది. ఆ విషయం కనిపెట్టిన సుమతి చిరునవ్వుతో రాజకుమారి బుగ్గలు నిమిరింది. రాగమణి సిగ్గుపడి ముఖం దించుకుంది.

అంతలోనే గుణసాగర్ కోట సింహద్వారం చేరుకున్నాడు. మహారాజు అతనికెదురు వచ్చి ఆప్యాయంగా

దగ్గరకు తీసుకున్నాడు. తర్వాత అతన్ని తిన్నగా మహల్లోకి తీసుకు వెళ్ళాడు. మహారాణి సంతోషంతో వారికి ఎదురు వచ్చింది. గుణసాగర్ మహారాణి పాదాలు తాకి నమస్కరించాడు. ఆనందంతో మహారాణి కళ్ళు చెమ్మగిల్లాయి. కాసేపు అక్కడ కూర్చుని మహారాజు గుణసాగర్‌ని తన విశ్రాంతి భవనానికి తీసుకు వెళ్ళాడు. ఆ భవనంలోనే గుణసాగర్ కోసం ఒక గదిని ప్రత్యేకించాడు.

గుణసాగర్ మహారాజు దగ్గర సెలవు తీసుకుని తన గదిలోకి వచ్చాడు. అప్పటికి జితేంద్రుడు కూడా అక్కడకు వచ్చాడు. గుణసాగర్‌ని చూడగానే విషయం అర్థం చేసుకున్నాడు. రాగమణి గుణసాగర్‌కి కనిపించలేదని తెలుసుకున్నాడు. 'జరిగినంత వరకూ బాగానే జరిగింది. జరగవలసింది కూడా అలానే జరుగుతుంది. ఎందుకు దిగులు పడతావు?' అన్నాడు గుణసాగర్‌తో నెమ్మదిగా.

గుణసాగర్ జితేంద్రుని మాటలకేమీ సమాధానం చెప్పకుండా తల్పం మీద పడుకుని కళ్ళు మూసుకున్నాడు.

## 29

మ్మరుచటి రోజు ఉదయం గుణసాగర్ జితేంద్రుడ్ని తీసుకుని రాజదర్బారుకు వెళ్ళాడు. మహారాజు గుణసాగర్‌కి తన సింహాసనం ప్రక్కనే ఆసనం ఏర్పాటు చేయించాడు. గుణసాగర్ ఆసనాన్నలంకరించగానే బలభద్ర దేవుడు ఒక ఉత్తరాన్ని మహారాజుకు అందజేశాడు. అది గజపతి మహారాజు సమాధానంగా వ్రాసిన ఉత్తరం. ఆ ఉత్తరాన్ని చదువుకుని మహారాజు చాలా సంతోషించాడు. తర్వాత అతను గుణసాగర్‌ని చూసి 'సాగర్! నా సైన్యాన్ని కూడా నీ వశం చేస్తున్నాను. నీ ఇష్టప్రకారం దాన్ని కూడా ఉపయోగించు,' అన్నాడు.

వెంటనే గుణసాగర్ జితేంద్రుని వైపు చూసి 'సైన్యాన్ని మూడు భాగాలు చేసి, నాలుగేసి వేల సైనికులను సుందరగడానికి రెండు వైపులా ఉంచు. మిగిలిన రెండు వేల సైనికులను పది భాగాలుగా విభజించి, అయిదు మైళ్ళ దూరం వరకూ అన్ని కోణాల్లోనూ పంపించు. ఎక్కడికక్కడే గుడారాలు వేయించు. పరిశోధకులను అన్ని వైపులకూ పంపించు. మహారాజా సైన్యాన్ని రేపు పరీక్షించి తగిన ఏర్పాటు చేస్తాను,' అన్నాడు. జితేంద్రుడు వెంటనే అక్కడినుంచి బయలు దేరాడు.

అంతలో కొందరు పరిశోధకులు దర్బారులో ప్రవేశించారు. 'మహారాజా! ప్రతాపసింహుడు తన యాభై వేల సైన్యంతోనూ బయలుదేరి మన మీదకు యుద్ధానికి వస్తున్నాడు. రెండు మూడు రోజుల్లో ఇక్కడకు చేరవచ్చు,' అన్నారు.

'సరే, మంచిది. మీరు తిరిగి మీ పనులు చూసుకోండి,' అని గుణసాగరే పరిశోధకులకు సమాధానం చెప్పి పంపించేశాడు.

మరునాడు మహారాజుతో కలిసి వెళ్ళి గుణసాగర్ సుందరగడం సైన్యాన్ని పరీక్షించాడు. వీల్లైనంత వరకూ తొలగించగా ఇంకా వెయ్యిమంది ముసల్మాన్ సైనికులు ఉన్నారా సైన్యంలో. సైనికుల పాటవం గుణసాగర్‌కి చాలా ఉత్సాహాన్నిచ్చింది. కాని, ముసల్మాన్ సైనికులను చూడగానే అతని ముఖ కవళికలు మారాయి. ఆ విషయం మహారాజు గమనించాడు. 'వీళ్ళను నౌకరీల్లోంచి తొలగిద్దామా?' అన్నాడు.

'అలా చేయకూడదు. అందువల్ల మనకే నష్టం. మనం తొలగించగానే వెళ్ళి శత్రువుల్లో కలిసిపోతారు. మనకు వీళ్ళవల్ల హాని కలగకుండా ఉండాలంటే శత్రువును ఎదిరించడానికి

వీళ్ళనే ముందు యుద్ధరంగంలో ప్రవేశపెట్టాలి. వీళ్ళ వెన కాల ఒక ఫిరంగి దళం, కొంత సైన్యం ఉండాలి. వాళ్ళల్లో వ్యతిరేక భావం కనిపించినా, శత్రువుల్లో కలిసిపోవడానికి ప్రయత్నం చేసినా ఫిరంగులతో ప్రేల్చి వేయబడతారు. అలాంటి భయంలో పెడితే ప్రాణాలకు తెగించి పోరాడ్డానికి సిద్ధపడతారు. కాని, ఫిరంగి గుళ్ళకు బలి కావడానికి ఇష్ట పడరు,' అన్నాడు గుణసాగర్.

గుణసాగర్ అభిప్రాయం మహారాజుకు బాగా నచ్చింది.

సైనిక పరీక్ష ముగిసింది. 'మహారాజా! వేటాడాలని కుతూ హలంగా ఉంది. అనుమతి ఇస్తే వెళ్ళి వస్తాను,' అన్నాడు గుణసాగర్.

'ఎక్కువ దూరం వెళ్ళకు. చీకటి పడకుండా తిరిగి రావాలి,' అన్నాడు మహారాజు. గుణసాగర్ తన గుఱ్ఱాన్ని అదిలించి అడవి వైపు పరుగెత్తించసాగాడు.

మహారాజు సూచన ననుసరించి బలభద్ర దేవుడు యాభై మంది సైనికులను గుణసాగర్ వెంట పంపాడు.

అందరూ గుణసాగర్‌తో కలిసి అడవిలో ప్రవేశించారు. వేటాడ్డం మొదలుపెట్టారు. దట్టమైన అడవిలో గుణసాగర్ రెండు అడవి పందులను బాణాలతో కొట్టి, వాటిని వెదకడం ప్రారంభించాడు.

అంతలో జితేంద్రుడు వచ్చి గుణసాగర్‌ని కలుసుకున్నాడు.

గుణసాగర్ అతన్ని చూడగానే 'అన్ని ఏర్పాట్లూ పూర్తయ్యాయా?' అన్నాడు.

'ఈ రోజునే పూర్తవుతాయి! కొంత ఈ వేళ అయింది. మిగతా పని రేపు పూర్తవుతుంది. మహమ్మదాలీ, నిత్యా నందం ఎలా ఉన్నారో చూసి రావాలని బుద్ధి పుట్టింది;

పదండి, ఒకసారి ఆ కొండ గుహను చూసి వద్దాము,' అన్నాడు జితేంద్రుడు.

గుణసాగర్ కొండ గుహ వైపు తన గుఱ్ఱాన్ని మళ్ళించాడు. జితేంద్రుడు వెనకాల వెడుతున్నాడు. వెళ్ళే ముందు సైనికులనందరినీ వెనక్కి వెళ్ళిపొమ్మని ఆజ్ఞాపించాడు.

కాసేపటిలో గుణసాగర్, జితేంద్రులు కొండ గుహను సమీపించి సొరంగంలోంచి లోపలకు వెళ్ళారు. ఎదుట కనబడుతున్న రాతి తలుపు దగ్గరకు వెళ్ళాక 'సాగర్! ద్వారం తెరవగలవా?' అన్నాడు జితేంద్రుడు.

'ఎందుకు తెరవలేను! మరచిపోవడానికి ఇందులో ఏమంత విశేషం ఉంది?' అని గుణసాగర్ సింహాన్ని సమీపించి నోటిలో చెయ్యి పెట్టి నాలుక పట్టుకొని బయటకు లాగాడు. ద్వారం తెరుచుకుంది. ఇద్దరూ లోపలకు వెళ్ళారు. మహాత్మ దాలీ, నిత్యానందం గుణసాగర్‌ని చూడగానే 'రాజకుమారా! మాకు ఎన్నాళ్ళీ శిక్ష? క్షమించి విడిచిపెట్టండి,' అన్నారు.

'కొద్ది రోజులు ఓపిక పట్టండి,' అన్నాడు రాజకుమారుడు.

కాసేపు గుణసాగర్ జితేంద్రులు గుహలో విహరించారు. అక్కడున్న చెట్లనుంచి కొన్ని పళ్ళు కోసుకొని తిని, సెలయేటిలో నీరు త్రాగారు.

'ఇక వెడదాం. ఆలస్యమౌతూంది,' అన్నాడు జితేంద్రుడు.

'ఇద్దరూ బయటకు వచ్చారు. 'నువ్వే ద్వారాన్ని తెరిచావు. తిరిగి బంధించు - చూస్తాను,' అన్నాడు జితేంద్రుడు.

'నేనే బంధిస్తాను, చూడు,' అని గుణసాగర్ ద్వారాన్ని బంధించాడు.

ఇద్దరూ గుఱ్ఱాలనెక్కి సుందరగడం సమీపానికి వచ్చారు. 'సాగర్! నేను మన సైనికుల నొకసారి కలుసుకొని వస్తాను.

నువ్వు తిన్నగా కోటలోకి వెళ్ళు. మహారాజు నీ కోసం చూస్తూంటారు,' అన్నాడు జితేంద్రుడు.

'అలానే!' అని గుణసాగర్ కోటలో ప్రవేశించి తనకు ప్రత్యేకించిన గదిలో విశ్రాంతి తీసుకోసాగాడు.

కొంత రాత్రి గడిచింది. జితేంద్రుడు గుణసాగర్ గదిలో ప్రవేశించాడు. గుణసాగర్ జితేంద్రుడ్ని చూసి 'ఏమిటి విశేషం?' అన్నాడు.

'సాగర్! నువ్వు చెప్పిన విధంగా అన్ని ఏర్పాట్లూ చేశాను. నిన్ను కలుసుకుందామంటే ఇంత వరకు ఒక్క నిమిషం కూడా ఖాళీ దొరక లేదు.'

జితేంద్రుని మాట విని గుణసాగర్ పకృున నవ్వాడు. 'మధ్యాహ్నంనుంచి సాయంకాలం వరకూ నాతోనే ఉన్నావు; ఒక్క నిమిషం తీరిక దొరకలేదంటున్నావు. బాగుంది!' అన్నాడు.

జితేంద్రుడు అదిరిపడ్డాడు. 'సాగర్! ఏమంటున్నావు?' అన్నాడు.

'అనడానికేముంది? నువ్వు నాతో కొండ గుహలోకి రాలేదా?'

గుణసాగర్ అలా అనగానే జితేంద్రుని ముఖం పాలి పోయింది. జితేంద్రుని స్థితి చూసి గుణసాగర్ కూడా ఆశ్చర్య పోతున్నాడు.

'సాగర్! నేను నిన్నెక్కడ కలుసుకున్నాను? ఎక్కడ వరకూ వచ్చాను? ఎప్పుడు నీ దగ్గర నుంచి వెళ్ళిపోయాను?' అని అడిగాడు జితేంద్రుడు.

గుణసాగర్ జరిగినదంతా చెప్పాడు.

'సాగర్! మోసపోయావు. గూఢచారుల మాయలో పడ్డావు. ఆ గూఢచారి మనం అక్కడకు వెడుతూండగా ఎప్పుడో చూసి ఉంటాడు. అతనికి ఆ ద్వారం తెరిచే విధానం తెలియక, అతి తెలివిగా నీ వల్ల ఆ రహస్యం తెలుసు కున్నాడు. గూఢచారులు తప్పించుకు పోయినందుకు నేను బాధ పడటం లేదు. కాని, ద్వారం తెరిచే రహస్యం వెల్లడై పోయింది. అందుకే బాధ పడుతున్నాను. అయినా, సాగర్! నేను ఎన్నిసార్లు కనిపించినా కంటిలో పుట్టు మచ్చను పరీక్షించమని చెప్పానుగా?'

'పొరపాటు జరిగింది జితేంద్రా!' అన్నాడు గుణసాగర్.

జరిగిన దానికి కాసేపు విచారించి ఇద్దరూ నిద్రపోయారు.

## 30

పూర్తిగా తెల్లవార లేదు. గుణసాగర్‌కి మెలకువ వచ్చే సరికి భవనమంతా ఏడ్పులతో నిండిపోయింది. అతను కంగారుగా గదిలోంచి బయటకు వచ్చాడు. దాసీలు ఆ మూల నుంచి ఈ మూలకు, ఈ మూల నుంచి ఆ మూలకు పరుగులెత్తుతున్నారు. అందరూ ఏడుస్తూనే ఉన్నారు. గుణసాగర్ తన ప్రక్కనుంచే పోతున్న ఒక దాసీ చెయ్యి పట్టు కుని ఆపు చేశాడు. 'ఏమి జరిగింది? ఎందుకేడుస్తున్నారు?' అన్నాడు. దాసీ దుఃఖాన్ని ఆపు చేసుకోలేక గొల్లుమంది. కాస్త దుఃఖాన్ని దిగ మ్రింగి 'రాజకుమారా! ఏమి చెప్ప మంటారు? మా రాజకుమారిని పాము కరిచింది. ఆమె ఈ లోకాన్ని విడిచి పెట్టింది,' అని చెప్పి అక్కడ నుంచి వెళ్ళి పోయింది.

ఆ మాట వినగానే గుణసాగర్ కంపించిపోయాడు. ఇక అక్కడ నిలబడలేకపోయాడు. పరుగెత్తుకుంటూ వెళ్ళి రాజ

కుమారి భవనంలో ప్రవేశించాడు. దాస దాసీలు భవనం నిండా గుమిగూడి ఉన్నారు. గుణసాగర్ అందరినీ త్రోసు కుంటూ లోపలకు వెళ్ళాడు. రాగమణి గది గుమ్మం దగ్గరకు వెళ్ళి, లోపలకు తొంగి చూశాడు. గదిలో కనబడిన దృశ్యం గుణసాగర్‌ని విచలితుడ్ని చేసింది. అతను 'సువర్ణసుందరీ!' అంటూ తెలివి తప్పి నేలమీద పడిపోయాడు.

అంతలో రేవతి అక్కడకు వచ్చింది. తెలివి తప్పి పడి పోయిన గుణసాగర్‌ని అక్కడనుంచి కొంచెం దూరంగా తీసుకుపోయి తెలివి రప్పించడానికి ప్రయత్నించింది. కాని, ఆమె ఎంత శ్రమ పడినా అతనికి తెలివి రాలేదు. ఆమె నిస్పృహాలో తన ప్రయత్నాన్ని విరమించి జితేంద్రుని కోసం వెదకడం మొదలు పెట్టింది. అక్కడ ఉన్న వారిలో జితేం ద్రుడు ఎక్కడా కనిపించక పోవడంతో తొందరగా గుణ సాగర్‌కి ప్రత్యేకించిన గది దగ్గరకు వచ్చి లోపలకు తొంగి చూసింది. జితేంద్రుడు గాఢంగా నిద్రపోతున్నాడు.

ఆమె సంశయిస్తే ప్రయోజనం లేదనుకుంది. వెంటనే జితేంద్రుడ్ని సమీపించి అతన్ని మేల్కొలిపింది.

జితేంద్రుడు కళ్ళు తెరచి రేవతిని చూశాడు. ప్రక్కన గుణ సాగర్ లేకపోవడం చూసి 'రేవతీ! రాత్రి సమయంలో ఇక్కడికి ఎందుకు వచ్చావు? రాజకుమారుడేడీ!' అన్నాడు అనుమానంగా.

'జితేంద్రా! సావకాశంగా వినండి. నేను చెప్పే విషయం నిర్మలంగా వినాలి. ఏమాత్రం తొట్రుపాటు పడినా మీ రాజకుమారుడ్ని దక్కించుకోలేరు.'

'రేవతీ! చెప్పవలసిందేదో తొందరగా చెప్పు. నువ్వు ఎలాంటి మాట చెప్పినా నేను కలవరపడను. రాజకుమారునికి

ఏదైనా ఆపద కలిగిందా? 'అతనేడి?' అని అడిగితే ముభావంగా మాట్లాడతావేం? విషయమేమిటో వెంటనే చెప్పు.'

'జితేంద్రా! రాజకుమారుడు తెలివి తప్పి పడిపోయారు.'

'ఎక్కడ?'

'రాజకుమారి భవనంలో'.

'ఒక్కడూ అతనెప్పుడూ అక్కడకు వెళ్ళడే! మీరెవరైనా దగ్గరుండి తీసుకు వెళ్ళారా?'

'కాదు, జితేంద్రా!...'

'సంశయిస్తావేం, తొందరగా చెప్పు.'

రాజకుమారి పాము కాటువల్ల మరణించింది. రాజకుమారుడు అక్కడకువచ్చి ఆమెను చూసి తెలివి తప్పిపడిపోయారు. ఎన్ని విధాల ప్రయత్నించినా ప్రయోజనం లేకపోయింది. కాస్త కూడా తెలివి రాలేదు.'

రాజకుమారి మరణించిందని వినగానే జితేంద్రుని ముఖం పాలిపోయింది. కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి. 'రేవతీ! రాజకుమారి మరణించడమే నిజమైతే, గుణసాగర్‌ని బ్రతికించ గలిగేవాళ్ళే ప్రపంచంలో ఉండరు. రాజకుమారిని అతను తన ప్రాణంకంటె ఎక్కువగా ప్రేమిస్తున్నాడు. ఆమెను తన దానిగా చేసుకోవడం కోసమే బలమైన శత్రువుతో పోరాడ్డానికి సిద్ధపడి వచ్చాడు. నడు, అతనెక్కడున్నాడో చూపించు,' అంటూ తొందరగా గదిలోంచి ఇవతలకు వచ్చాడు.

రేవతి కూడా నెమ్మదిగా బయటకు వచ్చి నిలబడింది.

'నిలబడ్డావేం, రా.'

'జితేంద్రా! మరొక మాట...'

'మాట మాటని నన్ను మాటి మాటికీ వేధించకు. చెప్ప వలసిందంతా ఒక్కసారి త్వరగా చెప్పేయి.'

'రాజకుమారితోపాటు సుమతి కూడా మరణించింది.'

'ఆఁ!'

'ఔను. ఆమెను కూడా ఆ పామే కరిచింది.'

జితేంద్రుడు కాసేపటివరకూ ఏమీ మాట్లాడలేకపోయాడు. తర్వాత నెమ్మదిగా దుఃఖాన్ని దిగమ్రింగి 'రేవతీ! ఇద్దరి నొక పాము ఎలా కరిచింది? నీకు తెలిసిందంతా వివరంగా చెప్పు,' అన్నాడు.

'రాత్రి రాజకుమారి, సుమతి ఒకే గదిలో పడుకున్నారు. నన్ను మహారాణీగారు కబురు పెట్టడం వల్ల రాజభవనంలో ఉండిపోయాను. ఒక గంట ముందు ఒక దాసీ 'రాజకుమారి గదిలో పాము! రాజకుమారి గదిలో పాము!' అంటూ పరు గెత్తుకుంటూ వచ్చింది. ఆ మాట వినడంతో నేను తృళ్ళిపడి లేచి కూర్చున్నాను. అప్పటికే మహారాజు, మహారాణీ రాజ కుమారి భవనం వైపు తొందరగా వెడుతున్నారు. నేను కూడా చురుగ్గా వెళ్ళి వారిని కలుసుకున్నాను.

'అందరం రాజకుమారి భవనంలో ప్రవేశించి గది గుమ్మం దగ్గరకు వెళ్ళాం. జితేంద్రా! లోపలి దృశ్యం చూడగానే నా ప్రాణాలు ఎగిరిపోయాయి. రాజకుమారి మంచం మీద పడు కొని ఉంది. సుమతి మంచానికి దగ్గరగా నేల మీద పడి ఉంది. ఇద్దరి శరీరాలూ నల్లగా మాడిపోయాయి. మహారాజు, మహారాణీ, నేను ఆతృతగా గదిలోకి వెళ్ళిపోయాం. అంతలో అక్కడున్న దాసీలు మమ్మల్ని లోపలకు వెళ్ళకుండా వారిం చారు. రాజకుమారి ప్రక్కలో పెద్ద త్రాచుపాము ఉందనీ, అది ఉండుండి బుసలు కొడుతూందనీ చెప్పారు. ఈ లోపుగా కొందరు సిపాయిలు బల్లాలు పట్టుకుని అక్కడకు

వచ్చారు. వారిలో ఒక సిపాయి తన చేతిలో ఉన్న బల్లాన్ని నేలమీద మోపాడు. ఖంగుమని చిన్న శబ్దమైంది. ఆ శబ్దంతో పాటు రాజకుమారి ప్రక్కలో చుట్టబెట్టుకుని ఉన్న నల్ల త్రాచు పడగ విప్పి తోకమీద లేచి ఆడ్డం మొదలు పెట్టింది. మరు నిమిషంలో ఒక సిపాయి దాన్ని బల్లెంతో పొడిచి చంపి బయట పడేశాడు. వెంటనే అందరం గదిలోకి వెళ్ళి చూస్తే ఇంకేముంది? - ఇద్దరి ప్రాణాలూ గాలిలో కలిసి పోయాయి. మంత్రగాళ్లు వచ్చి పెదాలు విరిచారు. అదే సమయంలో రాజకుమారుడు కూడా అక్కడకు వచ్చి, మరణించిన రాజకుమారిని చూసి తెలివి తప్పిపడిపోయారు. మహారాజు చాలా దుఃఖంలో ఉన్నారు. ఈ సమయంలో మీరు కూడా వివేకాన్ని విడిచిపెట్టి విచారంలో మునిగిపోతే చాలా ప్రమాదాలు ముంచుకొస్తాయి. శత్రువులు ఈ అవకాశాన్ని బాగా వినియోగించుకోడానికి ప్రయత్నిస్తారు. మనల్ని ఇంకా ఆపదలపాలు చేయడానికి సిద్ధపడతారు. మీకు నేను చెప్పవలసిన దాన్ని కాను. కాని, ఇప్పటి పరిస్థితిని బట్టి చెప్పాను. రండి, రాజకుమారి భవనానికి వెడదాము,' అంది రేవతి.

జితేంద్రుడు అతి ప్రయాసతో, పొంగి పొరలి వచ్చే దుఃఖాన్ని లోలోపలే అణగత్రొక్కి, రేవతి వెనకాల బయలు దేరాడు.

రేవతి ముందు నడుస్తూ అడ్డంగా ఉన్న మనుషులను ఒత్తిగించుకుంటూ జితేంద్రుడ్ని రాజకుమారి గది ముందుకు తీసుకు వెళ్ళింది.

రాజకుమారి శవం మంచం మీద ఉంది. సుమతి శవం క్రింద పడి ఉంది. విషపూరితమైన ఇద్దరి శరీరాలూ నల్లగా

మాడిపోయాయి. మహారాజు, మహారాణి-రాగమణి మంచం దగ్గర నిలబడి గోలపెట్టి ఏడుస్తున్నారు. బలభద్ర దేవుడు ఒక ప్రక్కను విచారంగా నిలబడ్డాడు. గది గుమ్మానికి వారగా తెలివి తప్పిన గుణసాగర్ పరుండబెట్టబడ్డాడు.

జితేంద్రుడు అక్కడి పరిస్థితి చూడ్డంతోనే నిర్జీవ ప్రతిమలా గోడకు జారబడిపోయాడు.



చనిపోయిన రాగమణి, సుమతుల చరిత్ర ఇంతటితో ముగియ వలసిందేనా? తెలివి తప్పిన గుణసాగర్‌కి తిరిగి స్పృహ వస్తుందా? రాగమణిని, సుమతిని మోహించి, కామాంధకారంలో కళ్ళు కానక కీర్తిసేన మహారాజుపై దండెత్తిన ప్రతాపసింహుడు తన కోరికను నెరవేర్చుకుంటాడా? పై ప్రశ్నలకు సమాధానాలు రాగమణి మూడవ భాగం 'మధుర ప్రణయం' చదివి తెలుసుకోండి!

అనేకమంది పాఠకుల కోర్కెపై

బైండ్లు తయారై సిద్ధంగా ఉన్నాయ్!

అసంఖ్యాకమైన పాఠకుల ఆదరాభిమానాలు

పొందిన

# భేతాళలోకం

(మిస్టరీ సీరియల్)

రచన: కృష్ణమోహన్

8 భాగాల సీరియల్ ఒకే బైండుగా అందాలు చిందే

ఎం. వి. యస్. గెటప్‌తో

వెల: రు. 4·50 నయాపైసలు మాత్రం!

ముందుగా సొమ్ము పంపినవారికి బైండు రిజిస్టర్డ

బుక్‌పోస్టులో పంపబడును.

ఏజంట్లకు 25% కమీషన్ ఇవ్వబడును.

వివరములకు:

ఎం. వి. యస్. పబ్లికేషన్స్

66, కోడంబాకం హైరోడ్, మద్రాసు-17.

కాపీలు సిద్ధంగా ఉన్నాయి!

అతి తక్కువ వెలకు అత్యుత్తమ సాహిత్యం!

శ్రీ ధనికొండ హనుమంతరావు రచించిన

## జగదేక సుందరి

# క్లియోపాత్రా

(అద్భుత చరిత్రాత్మక నవల)

త్రివర్ణ ముఖచిత్రం 575 పే. వెల: రు. 2-25

ప్రపంచంలోని అందమూ, అధికారమూ, ఐశ్వర్యమూ, మేధస్సూ ఒకే స్త్రీ సొత్తు ఐనట్లయితే ఆమె జీవితం ఎలా పరిణమిస్తుంది? ప్రపంచం ఆమెను ఎలా భరిస్తుంది?

సింహంలాంటి సీజర్‌నూ, పులిలాటి ఏంటనీని పాదాక్రాంతుల్ని చేసుకోగలిగిన పడతి క్లియోపాత్రా. ఒక్క నేజ్యాగ్రమన్‌రోన్న గాక, లోకచరిత్రనే తారుమారు చేయగలిగిన అబల ఆమె! ఆమె కథ 20 శతాబ్దాలు జీవించింది.

చక్కని శైలిలో, ఉత్తమస్థాయిని రచింపబడిన ఈ నవల శ్రీ ధనికొండ రచనల్లో అగ్రస్థానం ఆక్రమిస్తుందని నిస్సందేహంగా చెప్పవచ్చు....




MADRAS-17



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA126B162 |
| పుస్తకం పేరు | ప్రేమరాగం |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 93 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | C.T, BC |
| లేని పేజీలు | 71 to 74 |
| తయారు చేసినది | P. Jayamma |
| పేజీలు విడదీసినది | P. Jayamma |
| | Pravallika |
| పరీక్ష చేసినది | PRAGATHI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | NO |
| పరిస్థితి | good |